# ద్రావిడ బ్రాహ్మణి




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org







# ద్రావిడ బ్రాహ్మణ


రచయిత

త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (72) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ద్వితీయ ముద్రణ : ఏప్రిల్–2016

ప్రతులు : 1000 **వెల : 100 /-**

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్దమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బొర్మడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## ఇందూ జ్ఞానవేదిక మరియు ఇతర సంఘముల ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
**71) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**72) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**73) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**74) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
75) లు అంటే ఏమిటి? (తెలుగు)
76) ఆదిత్య.
77) చెట్టుముందా! విత్తుముందా?
78) ఒక్కడే ఇద్దరు.



### ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్చువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

### సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

### ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

### రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

***DVD'S***

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

DVD'S

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నాం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**

అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)

మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం
(జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)

క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)

ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)

చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)

నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)

రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)

కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)

బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)

పద్మావతినగర్, తిరుపతి టౌన్,
చిత్తూరు జిల్లా.
Cell : 9491773455, 9032903955.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు జిల్లా.
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181,
8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా,
ఆం.ప్ర.
Cell : 99780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16469

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848741703.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# ద్రావిడ బ్రాహ్మణ



మనిషి నివాసము భూమండలము. కొన్ని ప్రాంతములను లేక కొన్ని గ్రామములను కలిపి మండలము అనుట అందరికీ తెలిసిన విషయమే. అలాగే కొన్ని దేశములను కలిపి భూమండలము అని అనుచున్నాము. భూమండలములో ఎన్నో దేశములు కలవు. అటువంటి దేశములలో భారతదేశము కూడా ఒకటి. మనమందరము భారతదేశములోనే నివసిస్తున్నాము. భారతదేశములో ప్రాంతములుగా దాదాపు 29 రాష్ట్రాలు గలవు. ఒక్కొక్క రాష్ట్రమును ఒక్కొక్క ప్రాంతముగా లెక్కించుకొనుచున్నాము. భారత దేశమును ఉత్తర, దక్షిణ ప్రాంతములుగా విభజించితే, ఉత్తర దేశమున గల రాష్ట్రములలో నివసించువారిని ఆర్యులుగా, దక్షిణ భారతదేశమున గల రాష్ట్రములలో నివసించువారిని **ద్రావిడులు**గా చెప్పుచున్నాము. ఒకే దేశములోని వారిని రెండు పేర్లతో పిలువడమేమిటని ఎవరికైనా ప్రశ్న రావచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. వాస్తవానికి ఆర్యులు భారతదేశమువారు కారు. పూర్వము భారతదేశమంతా నివసించు ప్రజలను ద్రావిడులు అనేవారు. పూర్వము ఉత్తరమున కాశ్మీరు మొదలుకొని దక్షిణమున శ్రీలంక వరకు తూర్పున బంగ్లాదేశము మొదలుకొని పడమర దిక్కున గల పాకిస్తాన్, ఆఫ్ఘనిస్థాన్ వరకు భారతదేశము విస్తరించియుండెడిది. విశాలమైన భారత దేశమునందు కృతయుగము చివరిలో దాదాపు మూడుకోట్లమంది భారతీయులు ఉండెడివారు. కృతయుగము చివరివరకు ఈ దేశము ఇందూదేశముగా పిలువబడెడిది. భారతదేశమను పేరు కృతయుగములో లేనేలేదు. కృతయుగములో మధ్య ఆసియా ఖండములోని భూభాగములో ఆర్యులు నివసించెడివారు. కృతయుగము తర్వాత త్రేతాయుగములో మధ్య ఆసియా ఖండములో సంభవించిన కరువు కాటకముల వలన తినే తిండిలేక, బ్రతుకుతెరువు కొరకు అక్కడి ప్రజలు ఇతర ప్రాంతములకు వలస పోవడము జరిగినది.

మధ్య ఆసియాకు సంబంధించిన వారైనందున అప్పటికాలములో వారిని ఆర్యులు అనడము జరిగినది. కృతయుగమంతా మధ్య ఆసియాలో ఉండిన ఆర్యులు త్రేతాయుగములో గుంపులు గుంపులుగా తయారై కాశ్మీరము, సింధూనది పరివాహకము చేరుకొని, అక్కడినుండి ఆఫ్ఘనిస్తాన్, పంజాబ్ వరకు రావడము జరిగినది. తర్వాత కాలము గడుచుకొలది గుంపులు గుంపులుగా ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ మొదలగు భూభాగమంతా ఆక్రమించుకోవడము జరిగినది. అంతవరకు భారతదేశమంతా వ్యాపించియున్న ద్రావిడులు ఉత్తర దేశమునంతటినీ వదలి దక్షిణదేశమునకు చేరుకోవడము జరిగినది. భారతదేశమునకు వాయువ్యదిశన గల పర్వత ప్రాంతముల ద్వారా కొందరూ, సింధూనది మీదుగా పడవలలో కొందరూ మార్గము చేసుకొని వచ్చిన ఆర్యులు యుద్ధప్రియులు అయినందున వారిని ద్రావిడులు అడ్డుకోలేకపోయారు. తాము స్వతంత్రముగా ఉండదలుచు కొన్న ఆర్యులు ఉత్తర దేశమునుండి ద్రావిడులను భయపెట్టి తరిమివేశారు. ద్రావిడులు శాంతిప్రియులు, పోట్లాటలయందు ఆసక్తిలేనివారు గనుక, ఉత్తరదేశమును వదలి క్రమేపీ దక్షిణదేశమునకే పరిమితమైపోయారు. మధ్యప్రదేశ్ చివరిలో వింధ్యపర్వతములు భయంకర అరణ్యము ఉండుట వలన వింధ్యపర్వతముల వరకే ఆర్యులు ఉండిపోయారు. అప్పటినుండి ఉత్తర భారతదేశమంతయు ఆర్యులదేశమనీ, దక్షిణ భారతమంతయు ద్రావిడుల దేశమనీ పిలువడము జరిగినది.

భారతదేశమను పేరులేని కృతయుగములో ఇందూదేశమని పిలువ బడుచున్నదని చెప్పుకొన్నాము. శ్రీలంక, రామేశ్వరము మొదలుకొని హిమాలయముల వరకు ఇందూదేశమని పిలువబడుటకు, ఆ దినము దేశములోని ప్రజలందరూ **దైవజ్ఞానము** కలిగియుండడమే కారణము. దైవ

జ్ఞానముండుటచేత ఇది "జ్ఞానుల దేశము" అను అర్థము వచ్చునట్లు ప్రత్యేకించి ఇందూదేశమని పేరుపెట్టడము జరిగినది. ప్రపంచము మొత్తము మీద జ్ఞానులున్నదేశము, జ్ఞానశక్తియున్న దేశము, మనము నివసించు దేశము ఒక్కటే కావున మన దేశమునకు ఇందూదేశమని పేరు రావడము జరిగినది. ఆనాడు ఇందూదేశముగా యున్న దేశమే నేడు భారతదేశముగా పేరు మార్చుకొన్నది. అలా భారతదేశమని పేరున్నా పూర్వపు వాసనచేత హిందూ దేశమని కూడ నేడు పిలువబడుచున్నది. హిందూ దేశమనీ, భారతదేశమనీ రెండు పేర్లున్న దేశమైనా, విదేశీయుల దృష్టిలో దీనికి మరొక పేరు కలదు. ఆ పేరే ఇండియా. ప్రపంచములో మూడు పేర్లతో పిలువబడు దేశము మన దేశమేనని ఎవరూ మరువకూడదు.

మధ్య ఆసియానుండి వచ్చిన ఆర్యులు మొదటికి భారతదేశము వారు కాదు. వారి భాష కూడా హిందీభాష కాదు. వారు మన దేశమునకు రాక పూర్వమే లిపిలేని భాష కల్గియుండెడివారు. మొదట లిపిలేని సంస్కృత భాషను ఆర్యులు భారత (ఇందూ) దేశములోనికి ఆనాడు వారితో సహా తీసుకువచ్చారు. అప్పటికే దేశము మొత్తము ఇందువులుగాయున్న (జ్ఞానులుగా యున్న) ఇందూదేశమువారు, దేవుని జ్ఞానముతో ఎక్కువ దగ్గర సంబంధ మున్న తెలుగుభాషను కల్గియుండెడివారు. అటువంటి సమయములో ఇందూదేశమున ప్రవేశించిన ఆర్యులు, తమ భాషమీద పట్టుకోల్పోకుండ ఉండుటకు, ఒక ప్రక్క సంస్కృత భాషను వాడుచూ, మరొక ప్రక్క సంస్కృతములో కొన్ని తెలుగు పదములను, మరికొన్ని ఇతర క్రొత్త పదములను కలుపుకొని ఒక ప్రత్యేకమైన భాషను తయారు చేసి, అంతవరకు ఇందువులు వాడుచున్న తెలుగును తమవారు వాడకుండ కట్టుదిట్టము చేసుకొన్నారు. ఆ విధముగా ఆర్యులు తయారు చేసిన భాషయే

నేడు భారత దేశములో అత్యధిక ముగాయున్న హిందీభాష. మొదట తెలుగును ఆధారము చేసుకొని హిందీ భాషను తయారు చేయడము వలన, తెలుగు పదములు హిందీ భాషలో ఎక్కువగా నేటికినీ కనిపిస్తున్నవి. ఈ విధముగా త్రేతాయుగములోనే లిపిగల తెలుగు, హిందీ భాషలు రెండు, ఒక లిపిలేని సంస్కృత భాష తయారైనవి. తెలుగు భాష త్రేతాయుగములోనే క్రమేపి తగ్గుతావచ్చి కేవలము దక్షిణాదిలో గల కర్నాటక, ఆంధ్ర, తమిళనాడు, కేరళ రాష్ట్రములవరకే పరిమితమై పోయినది. అలాగే సంస్కృతమునకు వారణాసి కేంద్రముగాయుండగా, హిందీభాష ఉత్తర దేశమంతా వ్యాపించిపోయినది. ఆర్యులు తయారు చేసిన హిందీభాషకు లిపిని వారే తయారు చేశారు కనుక, హిందీ లిపితోనే సంస్కృత భాషను వ్రాసుకొనెడివారు.

హిందీ భాష తయారు కానంతవరకు సంస్కృతమును మాట్లాడడము తప్ప వ్రాయుటకు వీలుపడేదికాదు. ఆర్యులు ఇందూ దేశములోనికి రాకముందే ఋగ్వేదమును మొదట కొంత మాటల రూపములో చెప్పుకొనెడివారు. ఆ విధముగా వేదము వారికి అత్యంత ప్రీతిపాత్రమైనదే కాకుండా పూజ్యభావమైనదని చెప్పవచ్చును. కొంతవరకు సంస్కృత భాషలో మాటల రూపములో చెప్పుకొను ఋగ్వేదము ఇందూ దేశములోనికి వచ్చిన తర్వాత, హిందీలిపిని తయారు చేసుకొన్న తర్వాత ఋగ్వేదమును సంపూర్ణముగా తయారు చేయడము జరిగినది. తాము (ఆర్యులు) ఇందూ దేశములో ఏఏ ప్రాంతములను మొదట ఆక్రమించుకొన్నది, ఆ ప్రాంతము యొక్క విశేషాలను ఋగ్వేదములో వ్రాసుకొన్నారు. తర్వాత ఇందూదేశములో ఎక్కడెక్కడికి వెళ్ళినది మిగతా వేదములలో ఉన్నట్లు మన దేశ మొదటి ప్రధాని అయిన జవహర్‌లాల్ నెహ్రూగారు తన కూతురైన ఇందిరాగాంధీకి

వ్రాసిన ఒక లేఖలో వివరించి వ్రాయడము జరిగినది. ఆర్యులు రచనా సామర్థ్యము కలవారు. ప్రపంచ విషయములలో మేధావులు. అందువలన వారు మొదట వేద భాగములను చిన్నచిన్న వ్యాసములుగా వ్రాసుకొన్నారు. వేదములు ఆర్యుల మాతృభాష అయిన సంస్కృతములోనే హిందీలిపితో వ్రాసుకొన్నారు. సంస్కృతము తిరిగి పలికే దానికి అనువుగా ఉన్న భాష. ఉచ్ఛారణకు తెలుగులో పద్యము ఎలాగుండునో సంస్కృతములో శ్లోకము కూడా అలాగే ఉండును. తెలుగులోని పద్యమును మొదట ఒక పదమును చెప్పితే మిగతా పద్యమంతయు దానంతకదే నోటికి వచ్చునట్లు పదముల కూర్పు ఉండును. తెలుగు భాషలోని పద్యముల కూర్పులో అటువంటి మాధుర్యముండుట వలన, పేర్చబడిన రాతికుప్పలోని ఒక రాయిని పెరికినంతమాత్రమున మిగతా రాళ్ళన్నీ వాటికంతటికవే గలగలా వచ్చిపడినట్లు, పదములతో పేర్చబడిన (కూర్చబడిన) పద్యములోని ఒక పదమును చెప్పగలిగితే, మిగతా పదములన్నీ ధారావాహికముగా వరుసగా రావడమును చూచిన ఆర్యులు తెలుగు భాషను చూచి ఆశ్చర్యపోయినా, అది తమ భాష కాదు అను భావముతో అసూయచెంది, తెలుగు భాషలోని పద్యమును బోలునట్లు సంస్కృతములో ఏదో ఒకటి తయారు చేయాలని చాలాకాలము ప్రయత్నించి, చివరకు తెలుగులోనున్న వ్యాకరణమును పోలిన చంధస్సును సంస్కృతములో తయారు చేసుకొన్నారు. సంస్కృతములో తయారు చేసుకొన్న ఛందస్సును అనుసరించి ఛందోబద్ధముగా శ్లోకమును తయారు చేయడము నేర్వగలిగారు.

ఆ విధముగా తయారైన శ్లోకములు పద్యము యొక్క ఉచ్ఛారణవలె ఉండి, ఒక పదమును పలికిన వెంటనే మిగతా పదములు కూడా వెనువెంటనే నోటికి వచ్చునట్లుండుట వలన, తెలుగులో ఎన్నో కావ్యములను

కవులు పద్యములలో వ్రాసినట్లు ఆర్యులు తమ చరిత్రను, వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీతను మొదలగు వాటినన్నిటినీ శ్లోకముల రూపములలో వ్రాయగలిగారు. కృతయుగము తర్వాత త్రేతాయుగములో సంస్కృతమును అభివృద్ధి చేసుకొన్న ఆర్యులు హిందీభాష లిపిని ఉపయోగించి మొదట త్రేతాయుగములోనే రామాయణమును సంస్కృత శ్లోకములలో వ్రాశారు. అలా మొదలైన వారి రచనలు మహాభారతము వరకూ సాగాయి. అలా కలియుగము వరకు వ్రాయబడిన ఎన్నో సంస్కృత గ్రంథములను, మన తెలుగు కవులు సంస్కృతమునుండి తెలుగులోనికి వ్రాసి మనకు అందించారు. సంస్కృతములో వ్రాయబడిన భారతమును మన తెలుగు కవులైన నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱాప్రగడ అనువారు ముగ్గురు కలిసి తెలుగులోని పద్యముల రూపములో వ్రాసిఇచ్చారు. అలా పద్యరూపములో వర్ణించిన తీరు ఎంతో గొప్పగాయున్నట్లు పద్యముల వివరము తెలిసినవారికి తెలియును. ఆర్యులు పద్యములోని ఉచ్ఛారణ అందమును మించునట్లు శ్లోకములను తయారు చేయాలను ఉద్దేశ్యముతో చేసినా! వారు వ్రాసిన కావ్యములు, ఇతిహాసములు అన్నియు తెలుగు పద్యములలోనే శ్లోకముల కంటే అందముగా కనిపించు చున్నవి. నేటి మనుషులకు చరిత్రలో జరిగిన సమాచారము చాలా వరకు తెలియకుండాపోవుట వలన, ఆర్యులు గతములో చేసిన అసూయ పనులన్నియు నేటి ద్రావిడులకు ఏమాత్రము తెలియకుండా పోయినవి. అంతేకాక మేము ద్రావిడజాతివారమను విషయము కూడా దక్షిణ దేశమువారు మరచిపోయారు. అయినా ఆర్యుల సంతతయిన ఉత్తర దేశమువారు ఇప్పటికి కూడా ఎవరికీ తెలియకుండా, ద్రావిడుల మీద వివక్ష చూపుచునేయున్నారు. ఇంతవరకు ఆర్యులు ద్రావిడుల భాష విషయమును గురించి తెలుసుకొన్నాము. ఇప్పుడు ద్రావిడులకు ద్రావిడులను పేరు ఎలా వచ్చిందో తెలుసుకొందాము.

సృష్ట్యాదిలో దేవుడు తన జ్ఞానమును మనుషులకు తెలియజేయు నిమిత్తము, పంచభూతములలో పెద్దదైన ఆకాశము అను భూతము ద్వారా తన జ్ఞానమును శబ్ధరూపములో సూర్యుడు వినునట్లు చెప్పించాడు. సూర్యుడు మండే పెద్ద గోళముగాయున్నా, అది సూర్యుని స్థూల శరీరము మాత్రమే. సూర్యుడు ఆకాశవాణి ద్వారా వచ్చిన శబ్ధమును తన సూక్ష్మ శరీరములోని బుద్ధి ద్వారా గ్రహించుకొని, తాను విన్న జ్ఞానమునంతటినీ భూమిమీదగల మనువు అను ఒక వ్యక్తికి చెప్పాడు. మొదట ఒక భూతము చెప్పిన విషయమును గ్రహము గ్రహించి, అదే విషయమునే మనువు అను మనిషికి చెప్పడము జరిగినది. భూమండలములో అనేక దేశములున్నా అనేకమంది మనుషులున్నా, ఇందూదేశమైన (భారతదేశమైన) ఈ దేశములో నున్న మనిషికే సూర్యుడు చెప్పడమునకు కారణమేమైనా ఉన్నదా? అని నాకే ప్రశ్నవచ్చినది. అప్పుడు మీరైతే నన్ను అడుగవచ్చునుగానీ, నాకే ప్రశ్న వచ్చినప్పుడు నేను కూడా జవాబు కొరకు ఎవరినో ఒకరిని అడుగవలెను కదా! నాకు వచ్చిన ప్రశ్నను గురించి ఇతరులను ఎవరినీ అడుగనని చాలామందికి తెలుసు. నేను అడిగేది నా ప్రక్కవానినే (నా పొరుగు వానినే). నా ప్రక్కనున్న వాడు నాకు తెలుసు కావున, ఆయనను అడిగితే, నా హితుడు స్నేహితుడు అయిన ఆయన ఈ విధముగా చెప్పుచున్నాడు.

ఖగోళములో మొదట దైవజ్ఞానము తెలిసినవాడు సూర్యుడు ఒక్కడే. సూర్యుడు అన్ని దిక్కుల తన కిరణములను వెదజల్లువాడు, తన సూక్ష్మ శరీరముతో ఎక్కడికైనా పోగలవాడు. అందువలన మొట్టమొదట దైవ జ్ఞానమునకు అర్హుడైనాడు. సూర్యుడు తన సూక్ష్మశరీరము ద్వారా భూమిమీద మనువుకు జ్ఞానము చెప్పడములో ఇంతవరకు ప్రపంచములో తెలియని

కారణము కలదు. మనువు అను వ్యక్తి నివసించు దేశమే దానికి ముఖ్య కారణమని చెప్పగలము. దాని తర్వాత ఆ దినములలో తాను జీవించుటకు భూమిమీదకు రాలేదనీ, తాను తెలియవలసినది ఏదో ఉన్నదనీ, జీవితములో ఎంతో అసంతృప్తిగాయున్నవాడు మనువు. కావున అతనికి తెలుసు కోవలెనను శ్రద్ధయుండుట వలన అతనికే జ్ఞానమును చెప్పడము జరిగినది. అతని శ్రద్ధకంటే ముందు అతడు నివసించు దేశము ముఖ్యకారణమని చెప్పాము కదా! అదెలా ముఖ్యమనగా!

ఒకమారు భూమండలములోని 194 దేశములన్నిటినీ భూగోళము యొక్క చిత్రపటములో గమనించితే 194 దేశములలో ఏ దేశమునకూ లేని ఆకారము పూర్వమున్న ఇందూ దేశమునకు ఉండెడిది. ఒక మనిషి తన కుడి భుజముమీద ఒక చిన్న మూటను మోసుకుంటూ పోతున్నప్పుడు ఎలా ఉంటుందో, దానికి దగ్గర పోలికలున్న ఆకారము ఇందూదేశమునకు ఉన్నట్లు, ఆ చిత్రపటమును గమనించే వారందరూ గ్రహించవచ్చును. పెద్దదైన ఆసియాఖండములో ఇందూదేశము ప్రత్యేకమైన ఒక ఉప ఖండమువలె ఉంటూ, ఒక ప్రత్యేకమైన ఆకారమును సంతరించుకొని ఉన్నది. అలా ఉండునట్లు దేవుడే సృష్టించాడు. అలా మనిషి ఆకారమువలె ప్రత్యేకముగా యున్న చిత్రమును తర్వాత పేజీ పటములో చూస్తాము.

పటములో దాదాపు మనిషి ఆకారమును పోలిన ఇందూదేశము కనిపించుచున్నది. శ్రీలంక కాలిక్రింద ఆధారమైన భూమివలె కనిపించు చుండగా పడమటి కనుమలు, తూర్పు కనుమలు (పర్వతములు) రెండు కాళ్ళుగా ఉండగా, వింధ్యపర్వతములు నడుమువలె గలవు. ఇటు పాకిస్థాన్ కుడిచేయిగా; అస్సామ్, నాగాలాండ్‌లు ఎడమచేయిగా ఉండగా, పూర్వము ధృతరాష్ట్రుని భార్య గాంధారి పుట్టిన దేశము గాంధారదేశమైన ఇప్పటి




ఆఫ్ఘనిస్థాన్ మూటవలె ఉండగా, జమ్మూకాశ్మీరము తలవలె ఉన్నట్లు గ్రహించ వచ్చును. నేడు ఇతర దేశమైన ఇప్పటి పాకిస్థాన్, ఆఫ్ఘనిస్థాన్, అలాగే మరోప్రక్కయున్న నేపాల్, భూటాన్, బంగ్లాదేశ్, శ్రీలంక మొదలగు దేశములు అన్నియూ అప్పటి భారతదేశములోని అంతర్భాగములేనని తెలియవలెను. ఈ విధముగా ప్రపంచములో ఏ దేశములోలేని ప్రత్యేకత ఇందూదేశము యొక్క ఆకారములో ఉండుట వలన, మొత్తము ప్రపంచములో నేడు భారత

దేశముగాయున్న మనదేశము దైవజ్ఞానమునకు అర్హత పొందినది. కర్మయను బరువును మోస్తూ, నిత్యము కర్మను అనుభవించు మానవజాతికే నేను చెప్పుచున్న జ్ఞానము అన్నట్లు, మానవాకారములోనున్న భారతదేశములోనే మొదటి జ్ఞానమును సూర్యుడు చెప్పి, ఇందూ దేశమునకు సూర్యుడు ఆది గురువైనాడు.

శ్రీలంకకు అతి సమీపములోయున్న రామేశ్వరమునకు దగ్గరగా నివసించు మనువు అను వ్యక్తికి సూర్యుడు మొదట జ్ఞానము చెప్పడమైనది. ఆ విధముగా ఆదిలో ప్రథమముగా భూమిమీదికి జ్ఞానము వచ్చి చేరినది. అలా వచ్చిన జ్ఞానము స్వయముగా దేవుడే ఒక భూతము ద్వారా చెప్పించడము వలన, అదే జ్ఞానమునే సూర్యుడు విని చెప్పడము వలన, మన దేశములోనికి అన్ని దేశములకంటే ముందు దైవజ్ఞానము ప్రవేశించి నది. దక్షిణ భారతదేశమున ప్రవేశించిన జ్ఞానము కృతయుగములో భారత దేశమంతా వ్యాపించి ప్రతి మనిషి జ్ఞానసంపన్నుడైయుండేవాడు. ప్రతి మనిషి జ్ఞానసంపద కల్గియుండుటవలన కృతయుగము మొదటిలోనే మన దేశము (భారతదేశము) జ్ఞానుల దేశమని అర్థమొచ్చునట్లు ఇందూదేశమని పిలువబడెడిది. ఇందు అనగ చంద్రుడు అని అర్థము. చంద్రుడు జ్ఞానమునకు గుర్తుగాయుండుట వలన చంద్రుని పేరును కల్గియున్నట్లు ఇందూదేశమని ఆనాడు పేరు పెట్టడము జరిగినది. ఆనాడు మనుషుల నివాసమైన పట్టణములన్నియూ అర్థ చంద్రాకారముతోనే నిర్మించుకొన్నారు. గంగానది మొదలగు కొన్ని నదులు ఎన్నోచోట్ల అర్థచంద్రాకృతి ఆకారమును పోలినట్లు వంపు తిరిగియున్నవి. అలహాబాద్‌లో గంగానది అద్భుతముగా చంద్రవంక ఆకృతిలో వంపు తిరిగియున్నది. కాశీ మున్నగు నగరములు చంద్రవంక ఆకారములో నిర్మించబడినాయి. అంతేకాక భారత దేశమంతా

జ్ఞానమయమై ఉండుట వలన చంద్రవంక పేరు గుర్తుండునట్లు ఇందూ దేశమని ముఖ్యమైనవారు చెప్పగా, అందరూ వారిమాటను గౌరవించి ఈ దేశమును ఇందూ దేశమనీ, ఇందువుల దేశమని అనెడివారు. ఈ విధముగా ప్రపంచములో ఏ దేశమునకు లేని పేరు మన దేశమునకు రావడము ఈ దేశములో పుట్టిన మనందరికీ గర్వకారణమే.

ఇప్పటికాలములో భారతదేశమునకు పూర్తి దక్షిణమున నున్న శ్రీలంక త్రేతాయుగములో (త్రైతాయుగములో) ఇందూదేశమైన భారత దేశముతో కలిసియుండెడిది. సముద్రము అంచులో ఉండుట వలన ప్రకృతి ఉపద్రవములైన తుఫాన్‌లు మరియు సునామీల కారణమున కొంత దూరము విడిపోయి ప్రత్యేకమైన భూమిగా, ఇతరదేశముగా కనిపించుచున్నది. త్రైతాయుగమున కూడా భారతదేశముతో కలిసియుండుట వలన లంక ప్రాంతము కూడా ద్రావిడ రాజ్యములోనికి చెందినదనియే చెప్పవచ్చును. ఒక అంచనా ప్రకారము ద్వాపరయుగ మధ్యకాలములో లంక భారతదేశము నుండి విడిపోయి ప్రత్యేక దేశమైనది. భౌగోళికముగా మనిషి ఆకృతిని పోలియున్న భారతదేశమును కృతయుగములోనే ఇందూదేశమనెడివారని చెప్పుకొన్నాము. త్రేతాయుగములో ఆర్యులు ఇందూదేశమును ఆక్రమించు కొనుచూ వచ్చి, ఉత్తర భారతదేశములోని ఇందువులనందరినీ దక్షిణ దేశమునకు తరిమి వేయడము జరిగినది. ఆ దినములలో మధ్య ఆసియాలో కరువుల వలన తిండిలేక బ్రతుకుదుర్భరమై గుంపులు గుంపులుగా ఆర్యులు భారతదేశములో ప్రవేశించి, గంగానది ఒడ్డున మిగతా నదీప్రవాహక ప్రాంతములలో వ్యవసాయము మొదలగు కార్యములను చేయుచూ బ్రతుకుసాగించారు. అంతవరకు ఆ ప్రాంతములలో అక్కడక్కడాయున్న ద్రావిడులు ఆర్యులు ఘర్షణ పడేవారు. బ్రతకలేక చావో్బ్రతుకో అను

తెగింపుతో వచ్చిన ఆర్యులు ద్రావిడులను వారున్న ప్రాంతములనుండి తరిమివేయడము జరిగినది. అట్లు వింధ్యపర్వతముల వరకు భారత భూభాగమును ఆక్రమించుకొని ద్రావిడులకు ఉత్తరదేశమున నిలువ నీడ లేకుండా చేశారు.

ఈ విధముగా త్రేతాయుగములోనే ఆర్యులకు ద్రావిడులకు ఘర్షణ ప్రారంభమైనది. ఆర్యులు తాము స్వతంత్రముగా జీవించవలెనను స్వభావము గలవారు. ఇతరుల పెత్తనములో బ్రతుకుటకు వారికి ఇష్టముండదు. అందువలన స్వతంత్రముగా బ్రతుకుటకు తాము ముందు తయారు చేసిన వేదములను ఉపయోగించుకొన్నారు. హిందీలిపిని తయారు చేయునంతవరకు కంఠాపాటముగా చెప్పుకొను వేదములను అక్కడక్కడా వ్రాసి పెట్టుకోవడము జరిగినది. మేధాశక్తిగల ఆర్యులు ఆరుకోట్లమంది భారతదేశమునకు రావడము జరిగినది. అంతకుముందు భారతదేశమంతా మూడు కోట్లమంది ద్రావిడులు మాత్రమే ఉండెడివారు. దానిలోను ఉత్తర దేశమున పలుచగా అక్కడక్కడ అంతాకలిసి దాదాపు కోటి యాభైలక్షల మంది మాత్రముండెడివారు.ఆర్యులు గుంపులు గుంపులుగా ఆరుకోట్లమంది ఉత్తర భారతదేశమునకు రావడము వలన, వారి ధాటికి తట్టుకోలేని ద్రావిడులు చిన్నగా దక్షిణ దేశము చేరుకోవడము జరిగినది. ప్రక్క దేశము నుండి వచ్చిన ఆర్యులు ద్రావిడుల మీద పెత్తనము చెలాయించు స్వభావము గలవారై, ద్రావిడులను అసూయగా చూడను ఆరంభించారు. ఎక్కడైనా ద్రావిడులు కనిపిస్తే వారిని హేళనగా మాట్లాడడమే స్వభావముగా పెట్టుకొన్నారు. ద్రావిడులను హేళన చేయడము ఆర్యుల ముఖ్య ఉద్దేశ్యమైపోయివుండేది. ఈ నాటికీ వారి స్వభావము మారలేదు గానీ, ద్రావిడులు మాత్రము ఎటువంటి దురుద్దేశ్యమును ఆర్యులపట్ల పెట్టుకోలేదు.

నేడు దక్షిణ దేశమున గల ద్రావిడులు తమ చరిత్రను పూర్తిగా మరచిపోయి పూర్వము ఏమి జరిగిందో కూడా తెలియని స్థితిలో ఉన్నారు. అయితే ఆర్యులు మాత్రము వారి చరిత్రను చాలామంది ముఖ్యమైనవారు గుర్తుపెట్టుకొన్నారు. ద్రావిడుల పట్ల వివక్షనూ, అసూయనూ నేటికినీ వదలలేదు. ఎంతో తెలివైన మనిషి, పదునాలుగు భాషలలో పాండిత్యమును తెలిసినవాడు, భారత ప్రధానిగా కొన్ని సంవత్సరములు ఒడుదుడుకులు లేకుండా సమర్థవంతముగా భారత దేశమును పాలించిన పి.వి. నరసింహారావు ఢిల్లీలో చనిపోతే, ఆయన ఆంధ్రప్రదేశ్‌కు చెందినవాడైన దానివలన, ద్రావిడ జాతీయుడని తలచిన ఆర్యులు ఆయన అంత్యక్రియలు ఢిల్లీలో జరుపుటకు కూడా ఒప్పుకోలేదు. ఈ విధముగా అనేక సందర్భము లలో నేటికినీ ప్రవర్తించుచునేయున్నారు. అంతేకాక కొంత ప్రపంచ మేధావులైన ఆర్యులు ద్వాపర యుగములోనుండి దక్షిణ దేశములో కూడా ప్రవేశించిన ఆర్యులు అక్కడక్కడ తెలివిగా ప్రవర్తించుచూ, ద్రావిడుల మధ్య పోట్లాటలు పెట్టి తమాషా చూచిన సందర్భములు కూడా కలవు.

నేటి విషయములను అటుంచి పూర్వము జరిగిన పరిణామములను వివరించి చెప్పుకొంటే, నేడు ద్రావిడులకు తెలియని ఎన్నో విషయములు బయటపడగలవు. నా పుట్టుక ద్రావిడులలోనే ఉన్నది, కనుక ద్రావిడులకు జరిగిన, జరుగుచున్న అన్యాయములను గురించి చెప్పడము నా కర్తవ్యము. అందువలన మొదట "ద్రావిడు"లు అనుపేరు ఆనాటి కృతయుగము మనషులకు ఎలా వచ్చిందో తెలుసుకొందాము. ఆసియా నుండి వచ్చిన వారు "ఆర్యులు" అను పేరుతో పిలువబడకముందు వారిని వారు ఆసీయులు అని చెప్పుకొనెడివారు. ఆసీయులంటే ఆసియాఖండములో నివసించేవారని అర్థము. అటువంటివారు ఇందూదేశములో ప్రవేశించిన కొంత కాలమునకు

ద్రావిడుల వద్దయున్న జ్ఞానమును చూచి, వారు తమకంటే గొప్పవారు కారు, వారు ఎప్పటికీ మాకంటే తక్కువవారే అను భావము వచ్చునట్లు ఆసీయులను పేరును కొద్దిగా మార్చుచేసి 'ఆర్యులు' అని చెప్పుకొన్నారు. ఆర్యులు అనగా! గురువులు అను అర్థము వస్తుంది కనుక, తాము గురువులైతే మిగతావారందరూ తమక్రింద శిష్యులుగానే ఉంటారు అను ఉద్దేశ్యముతో తమను ఆర్యులుగా భారత దేశమునకు వచ్చిన తర్వాత చెప్పుకోవడము జరిగినది. ఆ విధముగా పేరుపెట్టుకోవడము కూడా ఆర్యుల కుతంత్రమును బయటపడుచున్నది. మేము ద్రావిడులకంటే గొప్పవారమను భావమే అందులో బహిర్గతమవుచున్నది.

ఆనాటి ద్రావిడులు ఆర్యులు చేయు కుట్రలు కుతంత్రములను గ్రహించలేక, వారి దృష్టియంతయూ ఆత్మజ్ఞానము మీద లగ్నము చేసియుండిరి. ప్రపంచ జ్ఞానము మీద ఎక్కువగా దృష్టిలేని ద్రావిడులు ఆర్యులు తమమీద అసూయ కల్గియున్నారనిగానీ, తమను హేళనగా చూస్తున్నారనిగానీ, అనుకోకుండా తమ పనిని తాము చేసుకొంటూ పోయెడి వారు. భూమిమీద ప్రప్రథమముగా జ్ఞానము తెలిసినది దక్షిణ దేశమున అయినందున, దేవుడు పంచిన జ్ఞానము దక్షిణ ప్రాంతమువారికి బాగా అంటుకొని అందరూ జ్ఞానులుగానే యుండెడివారు. మొదట దైవ జ్ఞానమును తెలిసిన వారికి "ద్రావిడు"లు అని పేరు రావడము జరిగినది. అంతకు ముందు మన దేశమునకు ఇందూదేశమనిగానీ, దేశ ప్రజలను ద్రావిడులు అనిగానీ పిలిచెడివారు లేరు. సృష్టి జరిగిన కొంత కాలమునకే ఇదంతా జరిగినది. అప్పుడు దేశమునకు ఒక పేరుండాలనిగానీ, తమకు ఒక పేరుండాలనిగానీ ధ్యాసలేని జీవితమును గడిపెడివారు. ఖాళీ పేపరు వలెనున్న అప్పటి ప్రజలకు సూర్యుడు మనువు ద్వారా జ్ఞానమును తెలియు

నట్లు చేశాడు. దైవజ్ఞానము తెలిసిన తర్వాత వారిలో ముఖ్యులైనవారు కొందరు ఆత్మప్రేరణచే తమ దేశమునకు పేరుపెట్టుకోవాలని అనుకొన్నారు. అప్పుడు వారు ఇందూ దేశమని పేరు పెట్టుకోవడము జరిగినది. మనిషి లోపల క్రొత్త ఆలోచనలను, క్రొత్త విధానములను, క్రొత్త సిద్ధాంతములను అందించువాడు ఆత్మే అయినందున క్రొత్తగా వచ్చిన "ఇందూ" దేశమను పేరు ఆత్మ అందించినదేనని తెలియవలెను. "మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనంచ" అను భగవద్గీతా వాక్యము ప్రకారము నా వలననే జ్ఞానము, జ్ఞప్తి, ఊహ వస్తుందని ఉన్నట్లు దేశమునకు పేరు జ్ఞానరీత్యా ఇందూ దేశమని రావడము జరిగినది.

ఇందు అనగా జ్ఞాని అని ముందే చెప్పుకొన్నాము. దైవ జ్ఞానమునకు గానీ, ప్రపంచ జ్ఞానమునకుగానీ చంద్రుడు అధిపతియని జ్యోతిష్య శాస్త్రములో కూడా తెలియుచున్నది. ఇందూ అనగా జ్ఞాని అని అర్థము. ఇందువులు అనగా జ్ఞానులు అని అర్థము, అయితే జ్ఞానులు అను మాట ప్రపంచ జ్ఞానులా? పరమాత్మ జ్ఞానులా? అను ప్రశ్నను రేకెత్తించగలదు. అందువలన అటువంటి ప్రశ్నకు సమాధానముగా తాము పరమాత్మ జ్ఞానులమే, ప్రపంచజ్ఞానులము కాదు అన్నట్లు ప్రజలకు ప్రత్యేకమైన పేరును పెట్టడము జరిగినది. ఇందూ దేశములో నివసించువారందరూ ఇందువులే అయినా, మేము ఫలానా ఇందువులమే అన్నట్లు దేశ ప్రజలందరికీ తమ జ్ఞానమునకు సరితూగగల పేరును పెట్టడము జరిగినది. ఆనాడు ఉన్న ప్రజలు ఎటువంటి జ్ఞానులో అటువంటి జ్ఞానమును తెలుపు నిమిత్తము "ద్రావిడ" అను మూడక్షరముల పేరును ఎన్నుకొని దేశ ప్రజలందరినీ ద్రావిడులు అని అనడము జరిగినది. ఆనాడు సూర్యుని ద్వారా తెలిసిన జ్ఞానము ఏదైతే ఉన్నదో, దానికి సరిపడు పేరును అర్థసహితముగా "ద్రావిడ"

అను మూడక్షరములను కూర్చిన పేరును పెట్టడమైనది. అర్థసహితము అంటే అర్థముతో కూడుకొన్నదని అర్థము కదా! అయితే ద్రావిడ అను పదము ఏ అర్థముతో కూడుకొన్నదో అని ఎవరైనా అడిగితే, ఆ వివరము తెలియునట్లు ఆనాడు జ్ఞానులైన పెద్దలు ఈ విధముగా తెలియచెప్పారు.

"తాము తెలుసుకొన్న జ్ఞానము అత్యున్నతమైన పరమాత్మ జ్ఞానము. ఇందులో ప్రకృతి జ్ఞానమునకు సంబంధములేకుండా కేవలము పరమాత్మ జ్ఞానము మాత్రమే ఉన్నది. పరమాత్మ సృష్ఠి పూర్వము ఒక్కడే అయినా సృష్ఠి తర్వాత మూడు ఆత్మలుగా విభజింపబడి విశ్వమును సృష్ఠించాడు. తాను మూడు ఆత్మలుగా విభజింపబడిన వాటిలో ఒకటి జీవాత్మగా ఉండగా, రెండవది ఆత్మగా ఉండగా, మూడవది పేరులేనిదై ఆత్మకంటే వేరుగా ఉన్నదై అదే అర్థముతో పరమాత్మ అని పిలువబడుచున్నది. సూర్యుడు చెప్పినదంతా మూడు ఆత్మల జ్ఞానమే అయినందున మూడు ఆత్మలకు గుర్తుగా మూడు అక్షరములను ఎన్నుకొని, ఆ మూడు అక్షరముల పేరునే అప్పటి ప్రజలకు పెట్టడము జరిగినది. పరమాత్మ నుండి మొదట ఆత్మ విడివడి, తర్వాత జీవాత్మ అనునది పరమాత్మనుండి విభజించబడి రావడము జరిగినది. దేవుడు అనబడు పరమాత్మనుండి ఆత్మ, జీవాత్మలు వచ్చాయి కనుక మొదట పరమాత్మకు గుర్తుగా 'ద్రా' అను అక్షరమునూ రెండవ ఆత్మకు గుర్తుగా 'వి' అను అక్షరమునూ, మూడవ ఆత్మయిన జీవాత్మకు గుర్తుగా 'డ' అను అక్షరమును గుర్తించి మూడు అక్షరములను కలిపి "ద్రావిడ' అను పదము వచ్చునట్లు చేశారు. మూడు ఆత్మల కలయికతో నున్న మనిషి అన్నట్లు "ద్రావిడ" అను పదమునుంచి అందరినీ కలిపి ద్రావిడులు అన్నారు. ద్రావిడులు అను పదములో ఒక విశేషమున్నది అది ఏమనగా!

పరమాత్మ, ఆత్మ, జీవాత్మ అను మూడు ఆత్మలలో పరమాత్మకు జీవాత్మకు ఎటువంటి సంబంధము ఉండదు. జీవాత్మకు పరమాత్మ ఎవరో తెలియదు. జీవాత్మకు అంతుచిక్కనివాడు పరమాత్మ. అయితే ఇద్దరికీ మధ్యనున్న ఆత్మ మాత్రము ఇటు పరమాత్మతోనూ, అటు జీవాత్మతోనూ ఎల్లప్పుడు సంబంధము పెట్టుకొని ఉంటుంది. పరమాత్మ (దేవుని) ఆజ్ఞ ప్రకారము నడుచుకొంటూ, జీవాత్మను కర్మప్రకారము నడుపునది మధ్యలోని ఆత్మయే. ఇంకా వివరముగా చెప్పితే పరమాత్మ రూప, నామ, క్రియలు లేనివాడు పరమాత్మతో ఏమాత్రము సంబంధములేని జీవాత్మ కూడా క్రియలేనివాడే అయినా రూపము, పేరున్నవాడే, పరమాత్మవలె పనులు చేయనివాడైనా కష్టసుఖములను మాత్రము అనుభవించడము జరుగుచున్నది. అనుభవించేదే పని అనుకుంటే రూప, నామ, క్రియలున్నవాడవుతాడు. ప్రత్యేకించి ఏ పనినీ చేయనివాడు గనుక, ఒక విధముగా దేవునివలె పని లేనివాడేనని చెప్పవచ్చును. ఇకపోతే మధ్యలోనున్న ఆత్మ మాత్రము ఒక్క క్షణము కూడ ఊరక ఉండక, జీవుని కర్మప్రకారమున్న పనులన్నిటినీ తాను చేయుచుండును. శరీరములోపల జరిగే ప్రతి పనిగానీ, శరీరముతో జరిగే బయట ఏ కార్యమైనాగానీ వాటిని ఆత్మ స్వయముగా చేయుచున్నది. జీవుడు చేయకుండా ప్రతిక్షణము జరిగే పనిని ఆత్మ చేయుచున్నదను విషయము ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. ఒక్క కర్మయోగులకు తప్ప ఆత్మ పనిచేయునను విధానము ఎవరికీ తెలియదు. అందరూ జరిగే పనులన్నిటినీ జీవుడే చేస్తున్నాడని అనుకొంటున్నారు. శరీరములోని జీవుడు కష్టసుఖరూపములో వచ్చు కర్మలను అనుభవించడము తప్ప, దేవునివలె పని చేయనివాడైయున్నాడు. జీవుడు, దేవుడు పని చేయకున్నా శరీరము లోపల ఇంద్రియములతో, శరీరము బయట ఇంద్రియములతో పని చేయు

వాడు ఆత్మ ఒక్కడే. ఆత్మ పనులను చేయడమే కాకుండా తనకు క్రిందయున్న జీవాత్మతోనూ పైన యున్న పరమాత్మతోనూ ఎల్లకాలము సంబంధము కల్గియుండుట వలన పైన, క్రింద ఇద్దరితో సంబంధమున్న ఆత్మను పైన క్రింద సున్నలున్న "వి" అను అక్షరముతో గుర్తించడమైనది. "వి" అను అక్షరము పైన గుడి కల్గి, క్రింద గుడికల్గియుండుటవలన, రెండువైపుల ఒకే విధముగా వంగియుండుటవలన ఆత్మకు గుర్తుగాయుంచుటలో "వి" అను అక్షరము పూర్తి న్యాయబద్ధముగాయున్నది. క్రింద "వి" ఆకారమును పెద్దగా చేసి చూస్తాము.




శరీరములో కత్తికి తెగని, అగ్నికి కాలని, నీటికి తడువని ఆత్మలు రెండు వున్నవి. అవియే ఒకటి పరమాత్మ, రెండు జీవాత్మ. అలాగే క్రియలు లేని (పనులు చేయని) ఆత్మలు కూడా పరమాత్మ, జీవాత్మయే. ఈ రెండు ఆత్మల మధ్యలో రెండిటితో సంబంధపడియుంటున్నది ఆత్మ ఒక్కటే. పైన పరమాత్మ, క్రింద జీవాత్మ వుంటుండగా, రెండిటితో సంబంధమున్నట్లు గల తెలుగు అక్షరములలో ప్రత్యేకించి "వి" ఒక్కటి మాత్రమే కలదు. తెలుగు భాషలో 'వి' అను అక్షరము జీవాత్మ, పరమాత్మ

లతో సంబంధమున్న ఆత్మను తన పోలికతో చూపుచున్నది. కనుక ఆత్మ జ్ఞానము కలవారమను సూచనతో 'వి' అను అక్షరమును మధ్యలో ఉండునట్లు "ద్రావిడ" పదమును ఆనాటి జ్ఞానులు గుర్తించారు. "ద్రావిడ' పదములో మధ్యనున్న 'వి' ఆకారమును అర్థమును తెలుసుకొన్నాము. అట్లే వి కి ముందు వెనుకగల ద్రా-డ అను అక్షరములను ఆనాటి జ్ఞానులు ఎలా పోల్చారో చూస్తాము.

పరమాత్మనుండి ఆత్మ, జీవాత్మ అను రెండు ఆత్మలు విభజింప బడినవని, ముందే చెప్పుకొన్నాము. అందువలన పరమాత్మను సూచించు అక్షరము రెండు అక్షరముల సమ్మేళనమై ఉండవలెనను ఉద్దేశ్యముతో 'దా' ను 'ర' ను కలిపి 'ద్రా' అను సంయుక్త (రెండు అక్షరములు కలిసిన) అక్షరమును ఉంచడము జరిగినది. "ద్రా" అను అక్షరమును విభజించి చూస్తే 'దా' మరియు 'ర' అను రెండు అక్షరములు ఉన్నట్లు తెలియుచున్నది. దానివలన రెండు ఆత్మలకు పెద్దయిన పరమాత్మ గుర్తుగా ద్రా అను అక్షరమును చెప్పుకొంటున్నాము. అలాగే జీవాత్మకు 'డ' అను అక్షరమును గుర్తించుకొన్నాము. జీవాత్మ ఏ ఆత్మతోను సంబంధములేనిదైనందున ఒకే అక్షరమైన 'డ' ను జీవునికి గుర్తుగా పెట్టడము జరిగినది. పరమాత్మ గుర్తయిన 'ద్రా' అను అక్షరము ప్రక్కలో ఆత్మ గుర్తయిన 'వి' అను అక్షరముండగా, చివరి జీవాత్మ గుర్తుగా 'డ' ను ఉంచడమైనది. డ అను అక్షర శబ్ధము తెగొట్టినట్లు నిలిచిపోవుచున్నది. కనుక జీవాత్మకు గుర్తుగా 'డ' అను అక్షరమునే చెప్పుకోవడము జరిగినది. మూడక్షరములను కలిపి ద్రావిడ అని పలకడములో, మూడు ఆత్మలు తప్ప ఏమీ లేవు అని తెలియునట్లు 'డ' అను చివరి అక్షరము తెంచివేసిన శబ్దముగా పలుక బడుచుండుట వలన, మూడు అర్థములతో కూడుకొన్న అక్షరములను పెద్దలు

ఎన్నుకొని, మూడు ఆత్మల జ్ఞానము తెలిసినవారయిన ఇందువులను ఆ దినము ద్రావిడ జ్ఞానము కలవారను ఉద్దేశ్యముతో ద్రావిడులు అన్నారు. ఈ విధమైన భావములో ద్రావిడులు అన్నా, ద్రావిడ జ్ఞానము అన్నా, ఆనాడు ప్రపంచమంతా గొప్ప గౌరవముండెడిది. అందువలన ద్రావిడ జ్ఞానముగల దేశమైన దానిని జ్ఞానులదేశమను అర్థముతో ఇందూదేశము అని ఉచ్ఛరించెడివారు.

మధ్య ఆసియాఖండమునుండి వచ్చిన ఆసీయులు జ్ఞానులైన ద్రావిడులను చూచి, అసూయతో వారికంటే పెద్దగా చెప్పుకొనునట్లు తమను ఆర్యులుగా చెప్పుకొన్నారు. ఆర్యులు అనగా గురువులు అని అర్థమొచ్చుట వలన, తాము జ్ఞానులకంటే పెద్దవారమని ప్రకటించుకొన్నారు. అయినా వారివద్ద దైవజ్ఞానము ఏమాత్రము లేకుండెడిది. ఏమాత్రము దైవజ్ఞానమును గానీ, మూడు ఆత్మల వివరముగానీ తెలియని ఆర్యులు తాము సృష్టించిన వేదములే గొప్పవనీ, వేదములలో సమస్త జ్ఞానము ఉన్నదనీ ప్రచారము చేశారు. వేదములు వాటిలోని అంతర్భాగములైన ఉపనిషత్తులు దైవ జ్ఞానమునకు నిలయమన్నట్లు, దేవుడు, జ్ఞానము భక్తి అను పదములను ఉపయోగించి వేదములయందు ఉపనిషత్తులందు, పురాణములందు వ్రాసినా, వాస్తవానికి అందులో మూడు ఆత్మల జ్ఞానము లేకపోయిన దానివలన, అవి జ్ఞానమునకు నిలయము కాలేకపోయాయి. చివరకు ద్వాపర యుగము నందు వ్యాసుని చేత నాల్గువేదములు, పదునెనిమిది పురాణములు, 1108 ఉపనిషత్తులు వ్రాయబడి గ్రంథరూపముగా మారినవి. ఆర్యుడైన వ్యాసుడు కూడా వేదములు, పురాణములు, ఉపనిషత్తులే ముక్తికి సోపానములని తలచి, అందులోయున్నది నిజమైన జ్ఞానమని పొరపడి, వాటిని గ్రంథముల రూపములో తీర్చిదిద్దడము జరిగినది. అంతవరకు

వేద సూత్రములను ఉపనిషత్తులను ఎందరో వ్రాసియుండగా, అంతవరకు చిన్నాభిన్నముగా యున్న వాటిని ఒకచోట చేర్చి, తాను కూడా కొంత వ్రాసి, నాల్గు వేదములను పూరించి గ్రంథరూపములో చేసిన మొదటివాడు వేదవ్యాసుడు. వేదములను వ్రాయుట వలన ఆయనను వేదవ్యాసుడని గుర్తింపుగా, వ్యాసుని పేరు ముందర వేద అను బిరుదునుంచడము జరిగినది.

నాల్గు వేదములను, పదునెనిమిది పురాణములను, 1108 ఉపనిషత్తులను ఛందోబద్ధముగా శ్లోకముల రూపములో వ్రాసిన వ్యాసుడు తాను గొప్పపని చేశాననీ, శాశ్వతముగా మనుషులకు జ్ఞానమును గ్రంథ రూపములో అందించాననీ సంతోషించాడు. అయితే ఆ సంతోషము చాలాకాలము నిలువలేదు. ద్వాపరయుగము చివరిలో ధర్మములు అధర్మములుగా మారిపోతున్నాయను ఉద్దేశ్యముతో, దేవుడు భగవంతునిగా పుట్టి తిరిగి తాను సృష్ట్యాదిలో సూర్యునికి చెప్పిన జ్ఞానమును భగవద్గీతగా అర్జునునికి చెప్పడము జరిగినది. భగవంతుడైన కృష్ణుడు చెప్పిన జ్ఞానము అర్జునుని ద్వారా వ్యాసునికి చేరడమైనది. మహామేధావియైన వ్యాసుడు భగవంతుడు చెప్పిన జ్ఞానమును విన్న తరువాత తాను ఎంతో పొరబడినా ననీ, తాను వేదముల రూపములో, పురాణముల రూపములో చెప్పినది జ్ఞానమేకాదని తలచి, తాను చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తముగా కృష్ణుడు చెప్పిన భగవద్గీతను గ్రంథముగా శ్లోకముల రూపములో వ్రాసి తృప్తి చెందాడు.

ఇందూదేశమునకు రాకముందు ఋగ్వేదమును కొంతవరకు సృష్టించుకొన్న ఆర్యులు, భారతదేశమునకు వచ్చిన తర్వాత మిగతా మూడు వేదములను, ఋగ్వేదములోని కొంత భాగమును, ఉపనిషత్తులను పురాణములను, రామాయణము మొదలగు ఇతిహాసములను తయారు

చేశారు. అందులో జ్ఞానమున్నదని చెప్పినా, అది మనుషులు చెప్పిన జ్ఞానమైనందున, దేవుడు చెప్పని జ్ఞానమైనందున వాటియందు జ్ఞానము నేతిబీరకాయయందు నెయ్యి ఉన్నట్లు తయారైనది. ద్రావిడుల జ్ఞానము కంటే తమ జ్ఞానము మించినది అన్నట్లు, బయటికి కనిపించు ఎన్నో ఆచరణలను సృష్టించుకొని, జ్ఞానులవలె కనిపించాలని ప్రయత్నించారు. ద్రావిడులు కర్మ, బ్రహ్మయోగములను ఆచరించగా, ఆర్యులు యజ్ఞ యాగములు, వేదాధ్యయణములు, తపస్సులు అనేక రకముల ఆరాధనలను అమలులోనికి తెచ్చి ఆచరించను మొదలు పెట్టారు. అప్పుడు కనిపించని కర్మయోగముకంటే, కనిపించే యజ్ఞయాగములు, వ్రతక్రతువులు, వేదాధ్యయణములు, తపస్సులు, దానములు బాగా కనిపించగా మిగతా ప్రజలందరూ వాటినే ఆచరించుటకు మొదలు పెట్టారు. ఈ విధంగా జరుగుచూ కాలక్రమమున ద్వాపరయుగ అంత్యమునకు యజ్ఞయాగాదులను తపస్సులను, దానములను, వేదాధ్యయణములను ఆచరించువారు ఎక్కువై పోయారు. రాజులు సహితము ఆర్యుల ఉచ్చులోపడిపోయి వారి కోర్కెలను తీర్చుకొనుటకు యజ్ఞయాగాదులను చేయను మొదలుపెట్టారు. పుత్రుల కోసము పుత్రకామేష్ఠియాగము త్రేతాయుగమున చేయగా, అదే యుగములోనే శ్రీరాముడు అశ్వమేథయాగమును చేసినట్లు మనకు నిరూపణలున్నవి. త్రేతాయుగములో ఎందరో మహర్షులు యజ్ఞములు చేయుచుండగా ఆ యజ్ఞములు అధర్మమైనవని వాటిని ధ్వంసము చేయుటకు దక్షిణమునగల శ్రీలంక నుండి రాక్షసులు వచ్చెడివారని ఇతిహాసమైన రామాయణమున వ్రాసుకొన్నారు.

త్రేతాయుగములోనే ఆర్యులైన వాల్మీకి వ్రాసిన రామాయణ గ్రంథము యజ్ఞయాగాదులు, తపస్సులు, వేదాధ్యయణములు ధర్మ

సమ్మతమైనవనీ, అవియే నిజమైన జ్ఞానమనీ, మనిషి తప్పక ఆచరించవలసిన ధర్మాచరణలని బోధించి వ్రాయడము వలన మిగతా వారందరూ ఆ మాటయే వాస్తవమనుకొన్నారు. కలియుగకాలము జరుగు ఈ కాలములో మేము ఆర్యులమను స్పృహ ఆర్యులకున్నా, మేము ద్రావిడులము అను స్పృహ (జ్ఞప్తి) ద్రావిడులకు లేకుండా పోయినందున ఆర్యులు చెప్పిన యజ్ఞ, దాన, తపస్సు, వేదములే నిజమైన జ్ఞానమని ద్రావిడులు కూడా భ్రమించడము జరిగినది. ద్వాపరయుగ అంత్యమునకే ద్రావిడులు తమ జ్ఞానమును కోల్పోయి పూర్తి అజ్ఞానదశలో ఉండుట వలన వ్యాసుడు వ్రాసిన వేదములు, ఉపనిషత్తులు, పురాణములు పెద్ద జ్ఞాన నిధులుగా కనిపించాయి. అలా కనిపించడము వలన తమ చరిత్రను, తమ జ్ఞానమును మరచిన ద్రావిడులు కూడా ఆర్యుల ఆచరణలను ఆచరించుటకు మొదలు పెట్టారు. ఈ విధముగా భారతదేశమంతాయున్న ఆర్యులు, ద్రావిడులు అందరూ యజ్ఞయాగాదులలో, వేదాధ్యయణములలో, దానములలో, తపస్సులలో మునిగిపోవడము వలన దేవుడు సృష్ట్యాదిలో బోధించిన మూడు ఆత్మలబోధ గానీ, కర్మ, బ్రహ్మ యోగములుగానీ ఎక్కడా కనిపించకుండాపోయినవి. అప్పుడు ధర్మమునకు ముప్పుకల్గి, ధర్మగ్లాని ఏర్పడినదని తలచిన దేవుడు ధర్మములలోని గ్లానిని తీసివేయుటకు భగవంతునిగా రావలసివచ్చింది. అలా వచ్చినవాడే ద్వాపరయుగ అంత్యములోని శ్రీకృష్ణుడు.

శ్రీకృష్ణుడు సాధారణ మనిషివలె వచ్చి, ఆయన ఫలానా (దేవుడే) అని గుర్తింపు లేకుండా సామాన్యునివలె వుండి, తిరిగి సృష్ట్యాదిలో సూర్యునికి చెప్పిన జ్ఞానమునే చెప్పి, ధర్మములలో తెలియకుండా దాగిన గ్లానిని తీసివేయడము జరిగినది. అలా బోధించిన బోధలో కృష్ణుడు ఒక సందర్భములో విశ్వరూప సందర్శన యోగమను అధ్యాయమున 48, 53

శ్లోకములయందు యజ్ఞముల వలనగానీ, దానముల వలనగానీ, వేదాధ్యయణము వలనగానీ, తపస్సుల వలనగానీ దేవున్ని తెలియుటకు సాధ్యముకాదని చెప్పడము జరిగినది. దేవుడు భగవంతునిగా (మనిషిగా) వచ్చి తిరిగి తన ధర్మములను తెలియజేసినా, ద్రావిడులు తమ జ్ఞానమును గుర్తించలేకపోయారు. కృష్ణుడు భగవద్గీతయను పేరుతో ఆదిలో చెప్పిన జ్ఞానమునే చెప్పి, పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16,17 శ్లోకములందు మూడు ఆత్మల త్రైత సిద్ధాంత జ్ఞానమును చెప్పినా గ్రహించలేకపోయారు. నేటికాలములో ద్రావిడులు పూర్తిగా అజ్ఞానములో కూరుకొనిపోయిన దానివలన, భగవద్గీతలో చెప్పిన జ్ఞానమును కూడా అర్థము చేసుకోలేని స్థితిలో ఉండిపోయారు. మొదటినుండి ప్రపంచ జ్ఞానములో మేథావులైన ఆర్యులు, తమ సమాజములను ద్రావిడ దేశమైన దక్షిణ భారతమున కూడా స్థాపించి, దేవుడు అధర్మమని సూచించిన కార్యములనే ద్రావిడుల చేత చేయించు స్థోమతకు ఎదిగారు.

ఆర్యులు ఇందూదేశములో త్రేతాయుగము మొదటిలో గానీ, లేక కొద్ది ముందుగా కృతయుగము చివరిలో గానీ ప్రవేశించారని తెలియు చున్నది. ఆర్యులు భారతదేశములో ప్రవేశించినప్పుడు ఆసీయులను పేరు కల్గి దానినే చెప్పుకొన్నవారు, కొంతకాలమునకు ద్రావిడులకంటే గొప్పగా కనిపించునట్లు తమను తాము ఆర్యులుగా (గురువులుగా) ప్రకటించు కొన్నారు. త్రేతాయుగము మొదటిలో ఉత్తర భారతదేశమును ఆక్రమించుకొని వింధ్యపర్వతముల వరకే ఆగిపోయి, దక్షిణ దేశమును ద్రావిడ రాజ్యమనిన ఆర్యులు, త్రేతాయుగము యొక్క మధ్యకాలమునకే తమ పెత్తనమును దక్షిణ దేశములో కూడా వ్యాపింపజేశారు. దైవజ్ఞానములో ముందుండి ప్రపంచ జ్ఞానములో వెనుకబడిన ద్రావిడులు, కృతయుగములో జ్ఞానులుగా

ప్రపంచ ప్రసిద్ధిగాంచి, త్రేతాయుగము మొదటి కాలములోనే తమలోని దైవజ్ఞానమును కోల్పోయారు. ఇటు దైవజ్ఞానమూ లేక, అటు ప్రపంచ జ్ఞానమూ లేక ఉభయభ్రష్టులుగాయున్న ద్రావిడులను చూచిన ఆర్యులు, అదే అదునుగా ఇందూదేశమను పేరును కొంతమార్పుచేసి, ఇందూ శబ్ధమును లేకుండా చేసి, హిందూ అను పేరును పెట్టి హిందూదేశమని చెప్పారు. తాము సింధూనది తీరము వెంట వచ్చామనీ, తమ వలననే సింధూనది ప్రాంతములోని నాగరికత భారతదేశములోనికి వచ్చినదనీ, దానివలన హిందూ దేశమని చెప్పుచున్నామనీ వివరణ కూడా ఇచ్చారు. అప్పటికే తాము జ్ఞానులమనీ, తమ జ్ఞానము వలననే భారతదేశమును ఇందూ దేశము అంటున్నారనీ, గట్టిగా ద్రావిడులు చెప్పలేకపోయారు. హిందూ అనుమాటను ఆ దినము ఖండించకపోవడము వలన, ఇందూ శబ్ధము కాలగర్భములో కలిసిపోయి, చివరకు హిందూ శబ్ధము శాశ్వతముగా నిలిచి పోయినది. ఈ విధముగా జ్ఞానులదేశమైన ఇందూదేశము యొక్క పేరును మార్చి హిందూదేశమని చెప్పిన ఘనత ఆర్యులకే దక్కినది.

మొదట జ్ఞానుల దేశమను అర్థమునిచ్చు ఇందూదేశము అను పేరును తీసివేసి, అర్థములేని హిందూ పదమును పేరుగా పెట్టడము కేవలము అసూయతో చేసిన పనేగానీ వేరుగాదు. తర్వాత ఎవరో ఒకరు రాబోవు దినములలో చరిత్రను తిరగతోడి, తిరిగి ఇందూదేశమను పేరును పొందవచ్చునను ఉద్దేశ్యముతో, మూడవ పేరును కూడా ఆర్యులే తేవడము జరిగినది. భారతదేశము అనుపేరును భరతుడను రాజు పాలించిన దేశముగా సాకు చూపించి, ఇందూదేశమునే భారతదేశమని కూడా చెప్పారు. ఈ దేశమును ఎందరో రాజులు పాలించగా, ఒక భరతుని పేరు మాత్రము ఎందుకు దేశమునకు అంటుకొన్నదో? ఎవరిని అడిగినా సమాధానము

చెప్పరు. ఈ విధముగా అర్థములేని హిందూ పదమునూ, ఆధారములేని భారత పదమును ఇందూదేశమునకు తగిలించి, అసలైన అర్థముతో కూడుకొన్న ఇందూ పదమును లేకుండా చేయడములో ఆర్యులు కృతకృత్యులైనారు. అలా దేశము పేరు మారిపోవడముతో, తమ చరిత్ర ఏమిటో ద్రావిడులకు తెలియకుండా పోవునను ఉద్దేశ్యముతోనే ఆర్యులు రెండు పేర్లను కల్పించి అసలు పేరును ముంచివేశారు. నేడు తమ చరిత్రను మరచిపోయిన, తమ జ్ఞానమును తెలియకుండాపోయిన, తమ ధర్మములను పూర్తిగా వదిలివేసిన ద్రావిడులు మిగిలియుండుట వలన వారు తమ దేశము పేరునుగానీ, తమ ధర్మములనుగానీ, తమ జ్ఞానమునుగానీ గుర్తించలేని స్థితిలో ఉండిపోయి, ఎవరు ఏమి చెప్పితే దానిని వినునట్లు ఉన్నారు.

ఒకప్పుడు కృతయుగములో దైవజ్ఞానమునందు తమను మించిన వారు లేరని అనిపించుకొన్న ద్రావిడులు త్రేతాయుగ కాలములో ఆర్యుల రాకతో కొద్దికొద్దిగా ప్రకాశించి ఆరిపోయిన దీపమువలె మారిపోతూవచ్చి, చివరకు అగ్గి మిగిల్చిన బొగ్గువలె మిగిలిపోతూ రావడము, ముందే మేధావులైన ఆర్యులకు బాగా అనుకూలమైనది. ఆర్యులు మొదట ఇందూదేశమునకు వచ్చినప్పుడు, స్వచ్ఛమైన ఇందువులను ఆర్యులు ద్రావిడులలో చూడగలిగారు. ఆ దినము ద్రావిడులలోయున్న జ్ఞానము, జ్ఞానశక్తి తమలో లేదనీ, అటువంటి శక్తిని, అటువంటి జ్ఞానమును తాము పొందలేమని తెలిసి, తమకంటే ఏ విషయములోనూ ద్రావిడులు పెద్దగా యుండడము సరిపోని ఆర్యులు, పథకము ప్రకారము ద్రావిడులను జ్ఞానమును కోల్పోయిన అజ్ఞానులుగా చేయాలనుకొని, వారికంటే మేమే పెద్ద అనునట్లు, తమను గురువులుగా (ఆర్యులుగా) చెప్పుకొన్నారు. తర్వాత

ఇందూదేశము పేరును మార్చి హిందూదేశమనియూ, భారతదేశమనియూ క్రొత్త పేర్లను పెట్టి ద్రావిడులు తమ చరిత్రను మరచిపోవునట్లు చేశారు. తర్వాత కులవ్యవస్థను ఆర్యులు ఎలా ప్రవేశపెట్టారో వివరించుకొని చూద్దాము.

కృతయుగము మొదటిలో సూర్యుడు మనువుకు జ్ఞానము తెలియజేసిన తర్వాత అప్పటి ప్రజలందరూ జ్ఞానమును తెలిసి గొప్ప జ్ఞానులుగాయుండడము వలన, ప్రపంచ దేశములలో ఈ దేశమును జ్ఞానుల దేశమని పొగడడము జరిగినది. దైవజ్ఞానమును కల్గిన ఇందూ దేశ ప్రజలలో రెండు వర్ణములు మాత్రము మిగిలిపోయినవి. వర్ణము అనగా రంగు అని అర్థము. ఆ దినములలో జ్ఞానమును పౌర్ణమి వెన్నెలగా, అజ్ఞానమును అమావాస్య చీకటిగా పోల్చి చెప్పెడివారు. వెన్నెల తెల్లగా ఉంటుంది, చీకటి నల్లగాయుంటుందని, జ్ఞాన అజ్ఞానములను తెలుపు నలుపు రంగులుగా పోల్చి చెప్పడము జరిగెడిది. కృతయుగములో మనుషులందరూ జ్ఞానము తెలిసినవారే అని చెప్పినా, అందరిలో మేము జ్ఞానులమే అను భావమున్నా నూటికి 98 మంది జ్ఞానులుకాగా, నూటికి రెండు శాతము మంది అజ్ఞానముకల్గి సరియైన జ్ఞానమును వారి బుద్ధి గ్రహించుకోలేని స్థితిలో ఉండెడివారు. అటువంటి అజ్ఞానులను నల్లని వారిగా, జ్ఞానులను తెల్లనివారిగా వర్ణములను (రంగులను) పోల్చి చెప్పడము ఆ దినము అలవాటై యుండెడిది. ఆ విధముగా మొదలైన వర్ణము అను పదము చివరకు కులము అను అర్థమును సూచించునదైనది. అందువలన ఇప్పటికీ కొందరు కులముల ప్రసక్తి వచ్చినప్పుడు వర్ణము అను పదమును వాడడము జరుగుచున్నది. వర్ణము అను పదము ఒక భాగమును, ఒక గుంపును సూచించునప్పుడు కూడా వాడవచ్చును.

కృతయుగము మొదటికాలములో సంపూర్ణ జ్ఞానులైన ద్రావిడులు ఇందూదేశములో ఒక గుంపుగా చెప్పబడుచూ, జ్ఞానములేని బహుకొద్ది మందిమాత్రము మరొక గుంపుగా చెప్పబడుచుండిరి. రెండు గుంపుల వారినీ రెండు వర్ణములవారని చెప్పడము కూడా జరిగెడిది. తెలుపు నలుపు వర్ణములుగా పోల్చి చెప్పబడు ఆ రెండు వర్ణములవారు మేము ఫలానా వారమని చెప్పుకోవడములో సిగ్గుపడెడివారు కాదు. జ్ఞానులను తెలుపు వర్ణముగా, అజ్ఞానులను నలుపు వర్ణముగా పోల్చి చెప్పుకోవడము జరిగెడిది. చంద్రుడు, వెన్నెల రెండూ జ్ఞానమునకు చిహ్నములనీ, అమావాస్య, చీకటి రెండూ అజ్ఞానమునకు చిహ్నములనీ చెప్పుకొనెడివారు. తాము సంపాదించు కొన్న జ్ఞానము ప్రపంచములో అన్నిటికంటే పెద్దది అయినందున దానిని బ్రహ్మ అనెడివారు. అదే విధముగా జ్ఞానమును సంపాదించుకొన్న వారిని అన్నిటికంటే పెద్ద దానిని (జ్ఞానమును) సంపాదించుకొన్నారు కాబట్టి, వారిని బ్రహ్మజ్ఞానులు అనెడివారు. ప్రపంచములో అన్నిటికంటే పెద్దది, అన్నిటికంటే ఉత్తమమైనది, అన్నిటికంటే రహస్యమైనది, అన్నిటిలో ప్రథమ స్థానమున ఉన్న జ్ఞానమును తెలిసినవానిని దాని ఉన్నత స్థాయికి (పెద్ద స్థాయికి) తగినట్లు, పెద్ద అను అర్థమువచ్చునట్లు బ్రహ్మ అనెడివారు. బ్రహ్మజ్ఞానము కలవారు అయినందున ఒక్కనిని బ్రహ్మ అనిగానీ, బ్రాహ్మణుడు అనిగానీ అనెడివారు. ఆనాడు ఇందూదేశములోని ద్రావిడులందరూ బ్రహ్మ (పెద్ద) జ్ఞానమును తెలిసినవారే అయినందున అందరినీ బ్రాహ్మణులు అనెడివారు. బ్రహ్మజ్ఞానము లేక దైవజ్ఞానమును బట్టి వీరు జ్ఞానులు అను సూచన ప్రకారము బ్రాహ్మణులు అనుట జరిగెడిది. బ్రాహ్మణులు అనుమాట వారు నేర్చిన విద్యనుబట్టి వచ్చినదిగానీ, అది ఒక కులము కాదు. ఆనాడు కులముల వ్యవస్థ లేనేలేదు. బ్రహ్మజ్ఞానమును లేక బ్రహ్మవిద్యను తెలిసిన

వాడు బ్రాహ్మణుడు అను ఒక వర్గము. బ్రహ్మజ్ఞానము తెలియనివారు కేవలము రెండు శాతము మంది ఒక వర్గము వారుగా ఉండెడివారు. తెలిసినవారు తెలియనివారు అను అర్థమునిచ్చు వర్ణములు తప్ప శతృత్వము నకు సంబంధించిన వర్గములు ఉండెడివి కాదని తెలియాలి.

ఆ దినములలో బ్రహ్మ జ్ఞానమును తెలిసినవారు గొప్పవారని, తెలియనివారు తెలిసినవారిని గౌరవించెడివారు. ఎక్కడైనా జ్ఞానమును తెలిసినవారు ఉన్నత స్థానము మీద కుర్చుంటే, జ్ఞానము తెలియని వారు దిగువ స్థానములో కూర్చుండెడివారు. ఉదాహరణకు బ్రహ్మజ్ఞాని అయిన వాడు ఒక అరుగు మీద కూర్చుంటే, జ్ఞానము తెలియనివారు అరుగు క్రింద స్థలములో కూర్చుండెడివారు. అట్లే ఎక్కడైనా దైవజ్ఞానమును తెలిసినవాడు కుర్చీలో కూర్చుంటే, దైవజ్ఞానమును తెలియనివాడు క్రింద కూర్చొని, పైన కూర్చున్న జ్ఞానిని గౌరవించెడివాడు. తెలిసినవారు వయస్సులో చిన్నవారైనా, తెలియనివారు వయస్సులో పెద్దలైనా, తమ వయస్సునుబట్టి చిన్న పెద్ద అనుకోకుండా, వారికున్న జ్ఞానమునుబట్టి చిన్నపెద్ద తారతమ్యములను లెక్కించుకొనెడివారు. తెలిసినవానికి మంచమైతే, తెలియని వానికి చాప అనియూ, తెలిసినవానికి చాప అయితే, తెలియనివానికి నేల అనెడిమాట నానుడిగా ఉండెడిది.

అదే పద్ధతిలో జ్ఞానమును తెలిసిన వానిని ఎగువవాడనీ, జ్ఞానము తెలియని వానిని దిగువవాడనీ అనడము జరిగెడిది. తెలియనివాడు తెలిసిన వానిని మా ఎగువవాడని సంబోధిస్తూ గౌరవప్రదముగా చెప్పెడివారు. అలాగే తెలిసినవారు తెలియనివారిని మా దిగువవారని సత్యమును చెప్పుచూ పలికెడివారు. తెలియనివారు తెలిసినవారిని మా ఎగువవారనుటకంటే మా కంటే పెద్దలు అను మాటను చెప్పుట మంచిదని తలచి, మా పెద్దలని

అర్థము వచ్చునట్లు మా బ్రాహ్మణులు అని కూడా చెప్పెడివారు. జ్ఞానము తెలియనివారు జ్ఞానమును తెలిసినవారిని మా పెద్దలనిగానీ, మా బ్రాహ్మణులని గానీ చెప్పుచుండగా, జ్ఞానమును తెలియనివారిని మా దిగువ వారనియే చెప్పెడివారు. అర్థమును తెలుపుటలో అంతకంటే మంచి పదము లేని దానివలన అలా చెప్పెడివారు. ఈ విధముగా ఆ దినము అనగా కృతయుగము మొదటికాలములో మనుషులయందు దైవజ్ఞానమును తెలిసిన వారు, తెలియనివారు అను రెండు రకముల వర్ణములు మాత్రము ఉండెడివి. వారినే మా బ్రాహ్మణులు అని తెలియనివారు, మా దిగువవారని తెలిసినవారు అనెడివారు. ఈ విధముగా మా బ్రాహ్మణ అని ఒక వర్గము లేక ఒక వర్ణము ఉండగా, మా దిగువవారను ఒక వర్గము లేక ఒక వర్ణమువారు ఇందూదేశమున ద్రావిడులయందు ఉండెడివారు.

కృతయుగమునుండి వున్న మా బ్రాహ్మణ, మా దిగువ అను రెండు వర్ణములవారిని త్రేతాయుగములో ఇందూదేశమున ప్రవేశించిన ఆర్యులు గమనించారు. అలా గమనించిన ఆర్యులు ఏకైక కుటుంబముగాయున్న ద్రావిడులకంటే తామే అధికులమన్నట్లు, తాము జ్ఞానులకు అజ్ఞానులకు అందరికీ గురువులమన్నట్లు, ఆర్యులను నామమును వారు తగిలించు కోవడము జరిగినది. ఇందూదేశములోనికి ఆర్యులు రాకముందు ఆసీయులను పేరుతోనున్న ఆసియాఖండమువారు, అప్పటికే మూడు లేక నాలుగు తెగలుగాయుండెడివారు. ఆ తెగలు వారికున్న జ్ఞానమునుబట్టి కాదుగానీ, వారికున్న పనులనుబట్టి తమలో తెగలు నిర్ణయించుకొని యుండెడివారు. ఆ తెగలే అప్పటికే కులములుగా, జాతులుగా చెప్పబడెడివి. ఇందూదేశములో లేని కులములు ఆసియాఖండములో అప్పటికే ఉండెడివి. మూడు నాలుగు కులములుగాయుండి ప్రపంచ జ్ఞానములో ఆరితేరిన

మేథావులైనందున, ఆర్యులు ద్రావిడులను అసూయతో అజ్ఞానులుగా చేయాలనుకొన్నారు. ద్రావిడులలో కులముల భాగములు చేస్తే, వారు కులముల ప్రకారము చీలిపోయి తమకంటే తక్కువవారై పోవుదురనీ, జ్ఞానములో భ్రష్టుపట్టిపోవుదురని తలచి, అదును చూచి ద్రావిడులలో బ్రాహ్మణ, మాదిగ అనునవి ప్రపంచరీత్యా కులములని ప్రచారము చేయడము మొదలుపెట్టారు. కృతయుగములో 17,28,000 సంవత్సరములు దైవ జ్ఞానులుగాయున్న ద్రావిడులు త్రేతాయుగ ప్రారంభమునుండే తమలోని జ్ఞానమును కోల్పోవను మొదలుపెట్టారు. అదే అదనుగా భావించిన ఆర్యులు బ్రాహ్మణ, మాదిగ అను తెగలను రెండు కులములుగా వర్ణించి చెప్పడము జరిగినది. అంతేకాక బ్రాహ్మణులది పెద్ద కులమని చెప్పుచూ, పనినిబట్టి మిగతావారందరినీ కులములుగా విభజించి బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు, శూద్రులని నాలుగు తెగలుగా చెప్పడమే కాకుండా, పనులు చేయు తెగలన్నియు శూద్ర కులమువారని చెప్పడము జరిగినది. శూద్రులు అనగా నీచమైనవారనీ, బ్రాహ్మణులు పవిత్రులనీ, మిగతా వైశ్య, క్షత్రియ కులమువారు తప్ప మిగతా అన్ని పనులు చేయు వారందరూ వారి పనులను బట్టి కులములుగా చీల్చివేయబడ్డారని చెప్పారు. కుండలు చేయువాడు కుమ్మరి అనియూ, ఇనుప సామాను పనిచేయువారు కమ్మరియనీ, గుడ్డలుతుకు వానిని చాకలియని అనేకరకముల వృత్తి పనులను చేయువారిని వృత్తినిబట్టి, పనినిబట్టి కులములుగా విభజించడము జరిగినది. ఇదంతయు ఆర్యులు ద్రావిడుల మీద అసూయతో చేసిన కుతంత్రమే అయినా, ద్రావిడులు ప్రపంచ జ్ఞానములో తెలివైనవారు కాకపోవడము వలన, ఆర్యులకు తమ మీదయున్న చెడు భావమును గ్రహించలేకపోయారు. ఈ విధముగా ఆర్యులు ద్రావిడులలో కుల బీజములు నాటగా అవి నేటికి మహావృక్షములై కూర్చున్నవి.

మన దేశచరిత్రలో త్రేతాయుగములోనే కులవ్యవస్థ ఆర్యుల అండదండతో ఇష్టమొచ్చినట్లు పెరిగిపోయినది. ఆసియా ఖండములో ముందే కులములు హెచ్చుతగ్గులుండడము వలన, అనుభవముతో ఇందూదేశములోనూ కులములను ప్రచారము చేసి మనుషులను చీల్చి, ఒకే కుటుంబముగా యున్న ఇందువులను (ద్రావిడులను) చిన్నాభిన్నము చేశారు. కులములు తయారు కాకముందు, ఆర్యులు ఇందూదేశములో ప్రవేశించకముందు అర్థముతో కూడుకొన్న మా బ్రాహ్మణ, మా దిగువ అను రెండు పేర్లతోయున్న ద్రావిడులలో కులవ్యవస్థ అందరినీ చీల్చివేయగా, మా బ్రాహ్మణ అనువారు రెండు శాతము, మా దిగువ అనువారు రెండు శాతము గుర్తింపుకు మిగిలిపోయారు. మిగతా తొంభైఆరు శాతము (96 శాతము) శూద్రులుగా మిగిలిపోయారు. బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు, శూద్రులు అని నాలుగు వర్గములుగా చీల్చినా, కొన్నిచోట్ల బ్రాహ్మణులు తప్ప మిగతావారందరూ శూద్రులే అను భావమున్నది. కృతయుగములో జ్ఞానులు, అజ్ఞానులు లేక మా బ్రాహ్మణులు, మా దిగువవారు అను రెండు పేర్లతోయున్నా, ద్రావిడజాతియను ఒకే గుంపుగా ఇందువులుండెడివారు. ఆ దినము ఇందువులు అనుదానికి గానీ, ద్రావిడులు అనుదానికిగానీ విశేషమైన అర్థముండెడిది. త్రేతాయుగము మొదటిలోనే వచ్చి చేరిన ఆర్యులు ద్రావిడుల మీద అసూయతో మేము వేరు, వారు వేరు అను భావముతో ఉద్దేశ్యపూర్వకముగా ద్రావిడులను కులముల వారిగా చీల్చివేసి చివరకు మేము ద్రావిడులము అనుమాటను మరిచిపోవునట్లు చేశారు. కలియుగములో ఇప్పటికీ ద్రావిడులను పేరును మేము చెప్పితే కూడా జ్ఞాపకము రానిస్థితిలో ద్రావిడులుండిపోయారు.

ద్రావిడులను విచ్ఛిన్నము చేయాలను ఉద్దేశ్యముతోనున్న ఆర్యులు ప్రణాళిక రూపొందించుకొని కులములుగా ఇందువులను చీల్చివేయడమే కాకుండా, వారిలో శూద్రులు నీచమైనవారనీ, బ్రాహ్మణులు పవిత్రులనీ, పవిత్రులైనవారు నీచమైన వారిని ముట్టుకోకూడదనీ, శూద్రుల గాలి తగిలితే కూడా బ్రాహ్మణులలోని కొంత పవిత్రత పోవుననీ, శాస్త్రీయతలేని మూఢనమ్మకములను ఏర్పరచి ఎక్కువశాతము ప్రజలను బ్రాహ్మణులనుండి విడదీసి, ఒకరి మధ్య ఒకరికి అంటరానితనమును ఏర్పరచారు. అంతటితో ఆగక ముందునుండి మా దిగువవారుగాయున్న రెండు శాతము మనుషులను శూద్రులలో కూడా కలుపక, వారిని ప్రత్యేకముగా పంచములని పేరుపెట్టి చెప్పడమైనది. పంచముడు అనగా ఐదవవాడని అర్థము. బ్రాహ్మణ మాదిగ ముందునుండి ఉండగా వారి పేర్లను అలాగే ఉంచి మధ్యలో 96 శాతముగాయున్న ప్రజలను శూద్రులుగా చేసి మిగతా రెండు శాతము మాదిగువ అనువారిని పంచములని ఐదవవారిగా చేశారు. ఐదవ వర్ణమునకు చెందిన మాదిగువవారు శూద్రులకంటే హీనమైన, నీచమైన వారని ప్రచారము చేశారు. బ్రాహ్మణులకు శూద్రులు ఎలా అంటరానివారో, అలాగే శూద్రులకు పంచములైన మాదిగవారు అంటరానివారనీ, మాదిగలను శూద్రులు అంటిముట్టుకోవడము వలన శూద్రుల యొక్క కలిమి, బలిమి తగ్గిపోవునని ప్రచారము చేశారు. ఆ ప్రచారముతో శూద్రులుగా (నీచులుగా) పిలువబడువారు కూడా మాదిగువ వారిని తమకంటే నీచులన్నట్లు చూచుచూ, వారిని ముట్టుకోవడము వలన తమ ధనము, బలము తగ్గిపోవునని అనుకొన్నారు. ఈ విధముగా ఆర్యులు చీడపురుగులై, ద్రావిడ వృక్షమును రంధ్రములు చేయుచున్నారని ఇందువులైన వారు గ్రహించ లేకపోయారు. వారు చెప్పినదే సనాతన ధర్మమని నమ్మారు. అప్పటినుండి శూద్రులు కూడా మాదిగువ వారిని అంటకుండా దూరముగా ఉంచారు.

కుల వివక్ష బ్రాహ్మణులు శూద్రులమీద చూపగా, శూద్రులు దిగువ వారుగాయున్న మాదిగవారి మీద చూపడము జరుగుతూ వచ్చినది.

కులము అను విష బీజము త్రేతాయుగములోనే మొదలైనది, ద్వాపర యుగమంతయూ కొనసాగినది. ప్రస్తుతము కలియుగములో ఇంతవరకూ కొనసాగినది. ఇంకనూ అక్కడక్కడ కొనసాగుచున్నది. కొన్ని పల్లెలలో మాదిగువవారితో పనిచేయించుకొని వారికి అన్నము పెట్టినా, నీరు పోసినా వారి పాత్రలను ప్రక్కనయుంచి వాటిలోనే పెట్టడము నేను స్వయముగా ఎన్నోచోట్ల చూచాను. నేను చిన్నప్పుడు, ఎండలో పనిచేయు మాదిగువవారు ఇంటిముందుకు వచ్చి దప్పికగాయున్నాము నీళ్ళు త్రాగాలని అడిగితే, మా ఇంటిలోని పెద్దలు ఒక పెద్ద చెంబుతో నీళ్ళు తీసుకొనిపోయి, వారి చేతులలోనికి చెంబును ఇవ్వకుండా, వారు చేతులు నోటిదగ్గర పెట్టుకొని వంగి నిలబడితే, చేతులలోనికి నీళ్ళు పోస్తే వారు త్రాగేవారు. అలా త్రాగడములో కొన్ని నీళ్ళు వేళ్ళ సందులలో క్రిందికి కారిపోయేవి. మాకు ఆ కార్యము వింతగా కనిపించేది. ఎందుకు అలా పోయాలి? చెంబు ఇస్తే నీళ్ళు క్రిందకుపోకుండా త్రాగేవారు కదాయని మా పెద్దలను అడిగితే, వారు మాదిగ వారు, వారు మన చెంబును ముట్టుకోరాదు అని చెప్పేవారు. అప్పుడు వారు అలా ఎందుకు చెప్పుచున్నారో అర్థము అయ్యేదికాదు. ఒక దినము మా తల్లి, తండ్రితో సహా ఒక ఊరిలోని బ్రాహ్మణుల ఇంటికి పోయాము. అప్పుడు వాకిలి దాటి లోపలికి పోతూనే వాకిలి ప్రక్కనే మేము క్రింద కూర్చున్నాము. ప్రక్కనే ఒక గూడు, అందులో చెంబు గ్లాసు, కొన్ని విస్తళ్ళు ఉన్నవి. అది పల్లెటూరు కావున భోజన సమయమునకు హోటళ్ళు కూడా లేకుండుట వలన వారి ఇంటిలోనే భోజనము చేయవలసి వచ్చినది. అప్పుడు వారు ప్రక్క గూటిలోని చెంబులోనికి నీళ్ళుపోసి,

గూటిలోని విస్తరి తీసుకోమని దానిలో అన్నము పెట్టడము జరిగినది. వారి పాత్రలో అన్నము తెచ్చి ఇంటిముందర కుక్కకు పెట్టినట్లు పెట్టిపోవడము, నీళ్ళు తెచ్చి పోసిపోవడమును గమనించితే మా ఇంటి ముందర నీళ్ళు అడిగిన మాదిగవాళ్ళకు నీళ్ళు పోసినట్లే, వీళ్ళు మాకు అన్నము పెట్టడము, నీళ్ళు పోయడము జరిగినదని అర్థమైనది. మా ఇంటి దగ్గర నీళ్ళు త్రాగిన వాళ్ళు మాకు అంటరానివారైతే, వీరి ఇంటివద్ద అన్నము తిన్న మేము వీరికి అంటరానివారముగా యున్నామనిపించింది, అనిపించడమే కాదు ప్రత్యక్షముగా కనిపించినది. నా వయస్సు తొమ్మిది లేక పది సంవత్సరములు ఉన్నప్పుడు జరిగిన ఆ రెండు సంఘటనలు నాకు బాగా జ్ఞాపకమున్నవి.

ప్రస్తుత కాలములో పట్టణ ప్రాంతములలో కుల వివక్షలు, అంటరానితనము అంతగా కనిపించడములేదు. పట్టణములలో అందరూ అన్ని పనులలో లగ్నమై, ఒకరికొకరు సంబంధములేకుండా పనులు చేసుకోవలసి యుంటుంది. ఏ కులమువాడు ఏ పనిచేయుచున్నాడో ఎవరికీ అర్థము కాదు. అందువలన ఒకరినొకరు పట్టించుకొనుటకు వీలుండని పరిస్థితిలో ఉండుట వలన పట్టణములలో కుల వివక్షలు, అంటరానితనము కనిపించడము లేదు. అయితే చిన్న గ్రామములలో శూద్రులు మాదిగలను అంటరాని వారిగా చూడడము నేటికినీ కనిపిస్తూనే యున్నది. అంతేకాక బ్రాహ్మణులు శూద్రులను అంటరానివారిగా చూడడము దేవాలయములవద్ద బాగా కనిపిస్తున్నది. ఏనాడో త్రేతాయుగములో ఆర్యులు ఇందూదేశమున అంటించిన జాఢ్యము నేటికినీ సాక్ష్యముగా కనిపిస్తూనే యున్నది. నాకు చిన్న వయస్సులోనే గాఢముగా అంటుకొన్న కుల వివక్ష సంఘటనలు నేను ఎప్పటికీ మరచిపోలేనివి. అయితే నేను ఇటు బ్రాహ్మణునిగా గానీ,

అటు మాదిగగా గానీ పుట్టకుండా కమ్మకులమున పుట్టి శూద్రునిగా లెక్కించ బడుచున్నాను. బ్రాహ్మణుల దృష్టిలో శూద్రులు అంటరానివారిగా యున్నప్పుడు, నేను కూడా వారికి అంటరానివాడనే కదా!

ఎంతో జ్ఞానినైనా, యోగినైనా నన్ను వారు అంటరాని శూద్రునిగా (నీచునిగా) లెక్కించడము వారు చేయుచున్న పెద్ద తప్పని అర్థమైనది. వారు ఎంతో పెద్ద తప్పు చేస్తున్నారని, సమాజమునకు తీరని అన్యాయము చేయుచున్నారని వారిని నేను అనగలిగినప్పుడు, అదే లెక్కప్రకారము మాదిగలను నీచముగా చూచు శూద్రులు కూడా మాదిగలపట్ల తీరని అన్యాయము చేసినట్లే కదాయని తెలియుచున్నది. మేము బ్రాహ్మణులను కుల వివక్షతో అంటరానివారిగా చూస్తున్నారని వారు చేయుచున్నది తప్పని అన్నప్పుడు, అదే మాటనే శూద్రుల గురించి మాదిగలు అనవచ్చును కదా! శూద్రులు బ్రాహ్మణులను అనడములో ఎంత న్యాయమున్నదో, మాదిగలు శూద్రులను అనడములో అంతే న్యాయమున్నది. ఇదంతయూ ఆలోచించిన మేము బ్రాహ్మణులకు, శూద్రులకు మధ్యనున్న అంటరానితనమును లేకుండా చేయుటకు ప్రయత్నించాలనుకొన్నాము. అదే విధముగా శూద్రులకు మాదిగలకు మధ్యనున్న అంటరానితనమును కూడా లేకుండా చేయుటకు ప్రయత్నించాలనుకొన్నాను. అలా చేయడము నేటి సమాజములో ఏటికి ఎదురీదినట్లుంది అనుమాట వాస్తవమే అయినా, ఆ ప్రయత్నమును వదలకూడదని, అనుకొన్న పనిని తప్పక సాధించాలనుకొన్నాను.

కుల వివక్ష లేకుండా చేయాలంటే ముందు ప్రతి మనిషికీ దేవుడు చెప్పిన జ్ఞానము తెలియాలి. దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియగలిగితే, దేవుడు అందరినీ సమానముగా పుట్టించాడనీ, అందరికీ ఒకే విధమైన అవయవములతో కూడుకొన్న శరీరమునే ఇచ్చాడనీ, దేవుడు ఎవరినీ

హెచ్చుతగ్గులుగా గానీ, కొందరిని పవిత్రులుగా, కొందరిని నీచులుగా గానీ పుట్టించలేదనీ తెలియుచున్నది. అటువంటప్పుడు దేవుని సృష్ఠిని కాదని మానవుడు కులాలు, మతాలు ఏర్పరచుకోవడము జరిగినదని తెలిసి పోగలదు. మానవుడు చేసిన తప్పిదమును మానవుడే సరిచేసుకోవాలను ఉద్దేశ్యములోనికి ప్రతి మనిషి వచ్చి ప్రయత్నము చేస్తే తప్పనిసరిగా కులము అను రోగము, అంటరానితనమను జాఢ్యము సమాజములో లేకుండా పోగలదు. అందువలన ఆ పనిని మొదట నేనే మొదలు పెట్టాలనుకొన్నాను. అందులోని భాగముగా ముందు చేయవలసిన పని శూద్రులలోనే అనేక కులములుండి, అందరూ శూద్రులే అయినా, ఏ కులమునకు ఆ కులము ప్రత్యేకము అనునట్లు ప్రవర్తించుచుండుటను గుర్తింపుగా తీసుకొని, మొదట శూద్రులలోని కులములను సమానము చేయాలనుకొన్నాము. దానికి మొదలు పెట్టవలసిన పని కులాంతర వివాహములు. ఎప్పుడు కులాంతర వివాహములు జరుగుతాయో అప్పుడు నీ కులము, నా కులము అనుమాట లేకుండా కులములు కలిసిపోతే తర్వాత దానంతకదే మనుషులందరూ కలిసిపోవడము జరుగుతుంది. అలాంటప్పుడు దేవుడు నాకు అందరూ సమానమే, నేను అందరినీ సమానముగా సృష్ఠించాననను మాట అర్థమవు తుంది. కనుక దేవుడు చెప్పిన జ్ఞానము అమలు జరుగుటకు కులము × కులము అనుమాట లేకుండా, కులము + కులము అనుమాట రావాలను సూత్రమును అమలు చేయాలనుకొన్నాను. అందువలన ఆ పనిలో భాగముగా నేను మొదట కులాంతర వివాహమును చేసుకొన్నాను. తర్వాత నా కుమారునికి కూడా కులాంతర వివాహము చేశాను.

నాలో వచ్చిన ఆలోచనను అంతటితో వదలక ఆచరణలోనికి మొదట నేనే తెచ్చాను. తర్వాత నా ఆధ్వర్యములో జరిగిన వివాహము

లన్నిటినీ కులాంతర వివాహములుగానే చెప్పి చేయించాను. ఇప్పటికి దాదాపు వందమందికిగానీ అంతకంటే ఎక్కువ మందికిగానీ కులాంతర వివాహములు చేయించి ఉంటాము. రేపు రాబోయే పౌర్ణమి రోజు అనగా రేపు రాబోయే మే నెల 14వ తేదీ 2014న రెడ్డి కులము అబ్బాయికి, పద్మశాలి (నేసే) కులము అమ్మాయికి పెళ్ళి జరుపబోతున్నాము. ఇప్పుడు పెళ్ళి చేసుకొను రెడ్డి కులము అబ్బాయి నాన్నకు కూడా కులాంతర వివాహమునకు మేమే పునాది వేశాము. ఈ విధముగా ఒక ప్రక్క కులాంతర వివాహములను జరుపుచూ, కులములను కలిసిపోవునట్లు చేయుచున్నాము. ఎవరి కులములో వారుంటూ అందరూ కలిసి ఏక కుటుంబముగా ఉండమని చెప్పుచున్నాము. అలాగే మరొక ప్రక్క దైవజ్ఞానమును బోధించుచూ, వేరువేరు మతముల వారు ఒకే త్రాటిమీదికి వచ్చి ఒకే దేవున్ని ఆరాధించునట్లు చేయుచున్నాము. అన్ని మతముల వారికీ దేవుడు చెప్పినది ఒకే జ్ఞానమని తెలిసిన ప్రజలు, వారివారి మతములలో వారుంటూనే అన్ని మతములవారము ఒకే దేవుని సంతతని తెలిసి, ఏక కుటుంబముగా మారిపోవుచున్నారు. మా జ్ఞానమును పూర్తిగా వినిన వాడుగానీ, పూర్తిగా చదివినవాడుగానీ, వారు ఏ కులములో యున్నా, ఏ మతములోయున్నా వారి కుల మతములను మరచిపోయి, మేమంతా మనుషులము అను భావముతో, మేమంతా ఒకే దేవుని జ్ఞానమును తెలుసుకొంటున్నాము అను భావముతో ఒకటిగా కలిసిపోతున్నారు. దానిని చూచి ఇట్లయితే మన కులము ఏమి కావాలి? మన మతమేమి కావాలి? అని బాధపడు ప్రక్కవారు కూడా ఉంటారు. అటువంటి వారు కూడా మా బోధలు వినినా, చదివినా తప్పక మారిపోగలరని చెప్పుచున్నాము. మేము చెప్పడమే కాకుండా మా వద్ద అన్ని కులముల వారిని సమానముగా

చూస్తున్నాము. అందువలన తక్కువ కులము అను భావము వారిలో లేకుండా పోవుచున్నది. తక్కువ కులము వారు కూడా మావద్ద ఎక్కువ కులము వారితో కలిసిపోవుచున్నారు. అలాగే ఎక్కువ కులము వారు కూడా తక్కువ కులము వారితో కలిసిపోవుచున్నారు.

మేము ఈ విధముగా చేయడము వలన ఆర్యులు ద్రావిడులకు చేసిన ద్రోహము కొంతయినా తరగగలదని అనుకొంటున్నాము. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగుటకు అవకాశము గలదు. అదేమనగా! కృతయుగ అంత్యములో, త్రేతాయుగము మొదటిలో ఆర్యులు ఇందూదేశ ములోనికి వచ్చి, ద్రావిడులవద్ద యున్న జ్ఞానమును చూచి అసూయపడి, ద్రావిడుల పతనమునకు ఎన్నో కుట్రలు, కుతంత్రములు చేశారని మీరు చెప్పుచున్నారు కదా! ఆర్యులు అంతగా కుట్రలు పన్నినప్పుడు ద్రావిడులైన వారు ఎవరుగానీ ఆర్యులు చేసే పనిని గుర్తించలేకపోయారా? ఆ కాలములో ఆర్యులు చేసిన తప్పులు ఈ కాలములోని మీకు కనిపించుచున్నప్పుడు, ఆ కాలములోని ఎవరికిగానీ ఆర్యుల తప్పులు కనిపించలేదా? మీకున్న తెలివి వారికి లేదంటారా? ఆ దినములలో ఆర్యులను గురించి ఎవరూ చెడుయని చెప్పనప్పుడు, మీరు మాత్రము ఆర్యులు చేసినవన్నీ చెడేనని చెప్పడములో మీ ఆంతర్యమేమిటి? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా గలదు చూడండి.

సత్యమును తెలుపడమే నా ఉద్దేశ్యము. ఉన్నదున్నట్లు విప్పి చెప్పడమే నా ఆంతర్యము. నాకు లోపల ఒకటి బయట ఒకటి పెట్టుకొని మాట్లాడడము అవసరము లేదు. మనుషుల దృష్టిలో కాకుండా దేవుని దృష్టిలో సక్రమముగా ఉండవలెననుకొనువాడిని. మనుషుల భావములో నేను చెడుగా కనిపించినా ఫరవాలేదు. అయితే దేవుని ధర్మమునకు

వ్యతిరేఖిని కాకూడదనుటయే నా పట్టుదల. ఆ కాలములో ద్రావిడుల స్వభావమును గురించి నేను ముందే చెప్పాను. ఆనాడు ద్రావిడులు తమకు దేవుని జ్ఞానమే ముఖ్యమనుకొని ఇతర విషయములందు తలదూర్చెడి వారు కాదు. అయినా ఆ దినములలో రాజుల పాలన సాగెడిది. ఏమి జోక్యము చేసుకొనినా రాజుగానీ, మంత్రిగానీ జోక్యము చేసుకోవలసియుండెడిది. ఆ విధముగా రాజులు కూడా జోక్యము చేసుకోకుండా ఆర్యులు ఇందూదేశములో ప్రవేశించినప్పుడు తెలివిగా ప్రవర్తించి, ఒక ప్రణాళిక ఏర్పాటు చేసుకొని ఆ ప్రణాళిక ప్రకారము కార్యములు చేసేవారని ముందే చెప్పాము. ఆ విధముగానే ఆర్యులు అప్పటి ద్రావిడ జనాభాకంటే రెండింతలు ఎక్కువగా వచ్చి, బ్రతుకుతెరువుకు ఇక్కడ ఎన్నో వనరులున్నా యని గ్రహించి, ఈ దేశమును వదలిపోదలుచుకోలేదు. అప్పుడు వారు తెలివిగా యజ్ఞయాగాదుల వలన రాజ్యము సుభిక్షముగా ఉంటుందని రాజుల వద్ద చేరి బోధించను మొదలుపెట్టారు. అంతవరకు యజ్ఞ యాగముల పేరుగానీ, వేదముల పేరుగానీ, తపస్సుల పేరుగానీ వినని రాజులు ఆర్యులు ఏదో క్రొత్త పద్ధతి చెప్పుచున్నారని వాటిమీద ఆసక్తిని చూపడము జరిగినది. యజ్ఞ యాగములను గానీ, తపస్సు, వేదములనుగానీ తెలిసిన వారు ఆర్యులు మాత్రమేనని తెలిసి వారిని తమ ఆస్థానములో ఉండమని కోరగా, అందులకు ఆర్యులు “మేము గురువులమనీ, రాజ గురువుగా ఆస్థానములో ఉంచుకొని మా సలహా మేరకు నడుచుకోవలసి యుంటుందని” తెలిపారు. అప్పుడు యజ్ఞముల మీద ఆసక్తికల్గిన వారందరూ ఆర్యులను తమ ఆస్థాన గురువులుగా నియమించుకొన్నారు. ఆస్థాన పండితులుగా, ఆస్థాన గురువులుగా రాజ్యములలో కాలుమోపిన ఆర్యులు ద్రావిడులైన రాజులను తమ చెప్పు చేతలలో పెట్టుకోవడము

జరిగినది. రాజువద్ద చేరిన ఆర్యులను చూచి వారిని ఎవరూ ఏమీ అనలేక పోయెడివారు. ఆర్యులు చేయుచున్నది ఒక ప్రక్క తప్పుగా కనిపిస్తున్నా వారిని గురించి వ్యతిరేఖముగా మాట్లాడితే రాజు కోపమునకు గురికావలసి వస్తుందేమోనని కొందరు ఊరక ఉండి పోవడము జరిగినది. ఈ విధముగా వారిని ఎవరూ ఏమీ అనలేకపోయారు.

ఇందూదేశమునుండి చీలిపోయిన లంక ఇప్పుడు భారతదేశమునకు దాదాపు ఇరవై కిలోమీటర్ల దూరములోనున్నది. కృతయుగములోనే భారతదేశము నుండి జరిగిపోవుటకు ప్రారంభించిన లంక త్రేతాయుగములో కొంతకాలమునకు అరకిలోమీటరు దూరములోగానీ లేక అంతకంటే తక్కువ దూరములోగానీ ఉండేది. అప్పటికే ఆర్యులు తమ ఆచారములను ద్రావిడులలో చొప్పించుటకు తమలో ముఖ్యమైన మేధావులైన ఋషులను దక్షిణ దేశమునకు పంపి దక్షిణ దేశ రాజుల చెంతకు చేరునట్లు చేశారు. దక్షిణ దేశమునగల రాజులకు యజ్ఞముల విశేషతను వాటివలన వచ్చు లాభములను చెప్పడమేకాక, అశ్వమేథయజ్ఞము మొదలగు యజ్ఞముల చేత యుద్ధము చేయకుండా రాజ్యములను తమ ఆధీనములోనికి తెచ్చుకోవచ్చునని తెలుపడము జరిగినది. అప్పటిలో రాజ్యకాంక్ష కల్గిన చిన్నచిన్న రాజ్యముల రాజులు తమ రాజ్యములను విస్తరించుకొనుటకో, ఇతర రాజ్యముల రాజులు తమమీద దండెత్తి రాకుండుటకో, తమ రాజ్యము సుభిక్షముగ ఉండుటకో, ఆశపడినవారై ఆర్య ఋషులు చెప్పినట్లు ధాన్యయజ్ఞము, వరుణయజ్ఞము, ధనయజ్ఞము, భూమియజ్ఞము, పుత్రకామేష్ఠి యజ్ఞము, రాజ్యకామేష్ఠి యజ్ఞము, విశ్వశాంతియజ్ఞము, సర్పయజ్ఞము అను మొదలగు అనేక పేర్లతో కూడుకొన్న యజ్ఞములమీద రాజుల దృష్ఠిని మళ్ళించి, వాటిని చేయించెడివారు. ఆ యజ్ఞములు చేయుటకు

వేదమంత్రములు అవసరమని, వేదమంత్రములను తామ మాత్రమే చెప్పగలమని, తమ అవసరము ఎంతో ఉన్నదని రాజులకు తెలుపుచూ, రాజులను వారి చెప్పుచేతులలో పెట్టుకొని ఉండిరి. దక్షిణ దేశములో కూడా ఎక్కడచూచినా యజ్ఞకార్యములు అందరూ చేయునట్లు ప్రేరేపించారు. యజ్ఞముల వలననే దేవతలు తృప్తి పొందుదురని చెప్పి, యజ్ఞములు చేయడమే నిజమైన భక్తి అని బోధించారు. ఈ విధముగా దక్షిణ దేశమును కూడా ఆర్యులు ఆక్రమించుకొని తమ ఆచరణలోనికి ద్రావిడులను కూడా మార్చుకొన్నారు.

ఈ విధముగా ఆర్యులు తమ తెలివిని ఉపయోగించి దక్షిణ భారత దేశమును కూడా ఆక్రమించిన విషయము, సమీపముననేగల శ్రీలంకా రాజ్యమునకు రాజయిన (లంకేశ్వరుడైన) రావణబ్రహ్మకు, ఆర్యుల విషయమంతయు తెలిసిపోయినది. రావణుడు స్వచ్ఛమైన ద్రావిడ బ్రాహ్మణుడు అయినందున మిగతావారికంటే ఎంతో గొప్ప తెలివైనవాడు. ఇటు ప్రపంచ తెలివిలో మేధావియేగాక, పరమాత్మ జ్ఞానములో చాలా గొప్పవాడు. జ్ఞానశక్తి సంపూర్ణముగా కల్గిన జ్ఞానము కలవాడు. లంకా రాజ్యములో స్వచ్ఛమైన పాలనచేస్తూ, ఒకవైపు ఇందూదేశములో ఆర్యులు చేయు ఆగడాలను గమనిస్తూ ఉండెడివాడు. రావణబ్రహ్మ రాజ్యమైన శ్రీలంకయంతయూ ద్రావిడులు మాత్రమే ఉండెడివారు. ఆర్యులను తన రాజ్యములోనికి రాకుండా రావణబ్రహ్మ కట్టుదిట్టము చేశాడు. ఒకవేళ ఎవరైనా దొంగచాటున లంకారాజ్యములోనికి సముద్రము ద్వారా రావాలను కొని ప్రయత్నించి అరకిలోమీటరు దూరము సముద్రములో పోయేలోపల లంక సైనికులు కనుగొని వారిని హతమార్చడము జరిగినది. అంతేకాక లంకకు సమీపమునయున్న భారతదేశములో కూడా కొన్ని ప్రాంతములలో

ఆర్యులను లేకుండా లంకసైనికులు తరిమివేశారు. ఈనాడు తమిళనాడు, కేరళ రాష్ట్రములుగానున్న ప్రదేశములలో ఆర్యులను రావణుడు తమ సైన్యము ద్వారా హింసించి తరిమివేశాడు. అందువలన ఆ దినములలో ఆంధ్ర దేశము వరకు ఆర్యులు వ్యాపించి తమ పెత్తనమును చెలాయించుచుండిరి. అప్పటికాలములో ఇప్పుడు తమిళనాడులోనున్న చెన్నపట్టణము (చెన్నై) వరకు, కర్ణాటకలోనున్న హంపివరకు ఆర్యులు పరిమితిగాయుంటూ అటు చెన్నపట్టణమును దాటిగానీ, ఇటు హంపిని దాటిగానీ ముందుకు పోలేకపోయారు. ఆ విధముగా వారు ముందుకు పోకుండుట రావణబ్రహ్మ యొక్క భయము వలననేనని చెప్పవచ్చును. ఆంధ్ర, కర్ణాటక, ఒరిస్సా, మహారాష్ట్రములుగాయున్న దక్షిణ భారతదేశమున ఆర్యులు తమ ఆర్య ప్రభావమును పెంపొందించుటకు యజ్ఞయాగాదులు, వేద అధ్యయనములు ఎక్కువగా చేయుచుండిరి.

అయితే ఎక్కడ వేదముల మంత్రములు చదువుచున్నారని తెలిసినా, ఎక్కడ యజ్ఞములు చేయుచున్నారని తెలిసినా, లంక రాజయిన రావణబ్రహ్మ తన సైనికులను పంపి వారిమీద దాడులు చేయించి యజ్ఞములను ధ్వంసము చేయించెడివాడు. వేదములను పలుకకుండా ఆర్యుల నోళ్ళు కుట్టివేసెడి వాడు. అంతవరకు ఇందూదేశములో ఆర్యులను ఎదిరించినవారే లేక పోయారు. అయితే మహామేధావి అయిన రావణబ్రహ్మ వద్ద ఆర్యుల ఆగడములు సాగలేదు. లంకరాజ్యము వారికి శత్రురాజ్యముగా కనిపించినది. లంకేశ్వరుడు ఆర్యులపాలిట యమునివలె కనిపించాడు. అందువలన లంక అనినా, లంకేశ్వరుడనినా, లంక సైనికులనినా, ఆనాటి ఆర్యులకు సింహస్వప్నమై పోయింది. భారతదేశములో చిన్నచిన్న రాజులను తమ వశములో ఉంచుకొనిన ఆర్యులు రావణబ్రహ్మ మీదికి, లంకా రాజ్యము

మీదికి దాడిచేయుటకు ఆ రాజులనందరినీ ప్రేరేపించారు. అయినా ఆ రాజులందరూ రావణబ్రహ్మ విషయములో వెనుకంజవేశారు. రావణుని మీదికి యుద్ధమునకు పోయి మేము తిరిగి రాలేమని జవాబు చెప్పారు.

లంకేశ్వరుడైన రావణుడు సూర్యగ్రహము ద్వారా మనువుకు అందిన జ్ఞానమును తెలియగలిగి, సంపూర్ణజ్ఞానిగా తయారవడమే కాకుండా సంపూర్ణ యోగియైనాడు. లంకారాజ్యములో కృతయుగ కాలమందున్న మా బ్రాహ్మణ, మాదిగువ అను రెండు రకముల మనుషులు మాత్రమేయున్నారు. రావణుడు స్వచ్ఛమైన బ్రాహ్మణ జాతివాడవడమే కాకుండా, దేశమునకు రాజయిన దానివలన ద్రావిడ బ్రాహ్మణులందరికీ నాయకుడుగా యుండి బ్రాహ్మణు లలో దైవభక్తి జ్ఞానశక్తి తగ్గకుండ చూచుకొనెడివాడు. భారత దేశము లంకతో కొంత విడిపోయి దూరముగా జరుగుచూ వచ్చిన దానివలన తన లంకా రాజ్యములోనే తన దృష్టిని ఎక్కువగా సారించి ద్రావిడ బ్రాహ్మణుడు ఎవడుగానీ అజ్ఞానములోనికి పోకుండా, జ్ఞానములోయుంటూ సూర్య గ్రహము ద్వారా అందిన మూడు ఆత్మల జ్ఞానమును పొంది, ఎంతో జ్ఞానశక్తికి నిలయమైయుండునట్లు రావణుడు పర్యవేక్షించుచుండెను. లంక మొత్తము మీద ఎక్కడగానీ అజ్ఞానము రెండుశాతము మనుషులలో తప్ప మిగతా వారిలో లేకుండెను. తొంభై ఆరు శాతము మనుషులు ద్రావిడ బ్రాహ్మణు లుగా మెలుగుచూ, ఆర్యులవలె కాకుండా యజ్ఞ యాగములకు, వేదాధ్యయనములకు, తపస్సులకు దూరముగా ఉండిరి. వారివద్ద అసలైన బ్రహ్మజ్ఞానముండుటవలన దేవున్ని ఒక్కన్ని తప్ప ఏ దేవతలనూ పూజించెడివారు కాదు. యోగమును తప్ప తపస్సును చేసెడివారు కాదు. అందువలన సంపూర్ణ జ్ఞానులై యోగులైన లంకలోని ద్రావిడ బ్రాహ్మణులకు రోగములు సహితము భయపడెడివి. ఏ రోగముగానీ లంక దరిదాపులకు

పోయెడిది కాదు. త్రేతాయుగ కాలములో భూమండలము మొత్తము మీద అత్యధిక యోగశక్తిగల యోగి, యోగీశ్వరుడు రావణుడు ఒక్కడేనని చెప్పవచ్చును. అందరికంటే పెద్దయోగి అయిన దానివలన పద్ధతి ప్రకారము పెద్ద అను గుర్తింపునకు తగినట్లు ఆయనను బ్రహ్మ అనెడివారు. అందువలన ఆయన పేరు చివరిలో మర్యాదపూర్వకముగా ఆయనను దైవ జ్ఞానము తెలిసిన జ్ఞానులందరూ బ్రహ్మ అని ఉచ్ఛరించుచూ "రావణబ్రహ్మ" అనెడివారు. ఆయన జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మల జ్ఞానమును తెలిసినవాడు అయినందున " త్రి ఆత్మజ్ఞాని" అనియూ, అట్లే భూత, భవిష్యత్, వర్తమాన కాలములను మూడు కాలములను తెలిసినవాడై యుండుట వలన "త్రి కాలజ్ఞాని" అనియూ అనడము జరిగినది.

భగవద్గీతా జ్ఞానములో అధర్మములని, వీటి వలన దేవుడు తెలియ బడడని దేవుడే చెప్పినా, ఆ మాటను అతిక్రమించి అధర్మములైన యజ్ఞ యాగాదులను, వేదముల అధ్యాయనమును, తపస్సులను ప్రవేశపెట్టి దైవ జ్ఞానమును కలుషితము చేయాలని చూచిన ఆర్యుల ప్రయత్నమును ఎదురించి, ఇవి అధర్మములు అని చెప్పడము వలన, ఈయన ధర్మముల గ్లాని అయిన కలుషితమును తీసివేయుటకు వచ్చిన భగవంతుడేమోనని ఊహ రాక తప్పదు. అయితే అంతటి గొప్ప వ్యక్తిని నేడు మానవులు అజ్ఞానులైపోయి, ఆర్యులు బోధించిన దానిని విని, రావణబ్రహ్మను, త్రికాల జ్ఞానిని సాధారణ మనిషికంటే నీచునిగా పోల్చి మాట్లాడుచుండడమును చూస్తే, యోగి అయిన నాకు కొంత బాధగానే యున్నది. అందువలన మరుగున పడిపోయిన సత్యమును బయటికి తీసి, రావణుడు అజ్ఞానికాదు జ్ఞాని అనియూ, ఆయన దుర్మార్గుడు కాదు సన్మార్గుడనియూ, ఆయన శూద్రుడు కాదు సద్బ్రాహ్మణుడు అనియూ, ఆయన సామాన్యుడుకాదు

గొప్ప యోగీశ్వరుడనియూ తెలియజేయాలనుకొన్నాను, తెలియజేయు చున్నాను. కొందరికి కొన్ని ప్రశ్నలు వచ్చి ఇలా అడుగవచ్చును. రామాయణ చరిత్రలో రావణున్ని పూర్తి దుర్మార్గునిగా చూపడము జరుగలేదా? రావణుడు కామాంధకారుడై అరణ్యములో ఒంటరిగాయున్న సీతను అపహరించుకు పోలేదా? ఆంజనేయున్ని దూతగా పంపినా సీతను వదలకుండా రావణుడు ఒక స్త్రీ కొరకు రామునితో యుద్ధము చేయలేదా? చివరికి రాముని చేతిలో చిక్కి రాముని బాణమునకు ప్రాణాలు వదలలేదా? ఈ విధముగా ఒక స్త్రీ సాంగత్యము కొరకు చివరకు ప్రాణాలను పోగొట్టుకొన్న తెలివితక్కువ వానిని వెనకేసుకొని మాట్లాడడము, మీరు ఒక రచయితగా చేయవలసిన పనేనా? పైగా తమరు కూడా యోగీశ్వరులను నామధేయమును కల్గి రాక్షస రాజయిన ఒక అసురుని కొరకు ఇంతగా మాట్లాడడము మీకు తగునాయని అడుగుటకు అవకాశము కలదు. రామాయణ చరిత్ర చదివిన వారు ఎవరైనా ఇలాగే ప్రశ్నించగలరు. అయితే ఆ ప్రశ్నలన్నిటికీ జవాబు చెప్పవలసిన బాధ్యత నాదేనని ఒప్పుకొనుచూ, జవాబుకంటే ముందు మీ ప్రశ్నలన్నీ సమంజసమైనవే, మీరు ఎంతో జ్ఞాపకశక్తితో, విచక్షణాశక్తితో ఈ ప్రశ్నలను అడిగారు. అలాగే అదే విమర్శనా శక్తితో, స్వచ్ఛమైన న్యాయపద్ధతిలో నా జవాబులను కూడా చూడవలెనని తెలుపుచున్నాను.

రామాయణ చరిత్ర రాకముందే, అదియంతయు జరుగకముందే, రావణబ్రహ్మ ఆర్యులకు బద్ధ శత్రువు అనుమాటను మరచిపోకూడదు. శ్రీరామునికి పెళ్ళికాక ముందునుండీ, రాముడు పుట్టకముందు నుండీ రావణుడు ఆర్యులకు విరుద్ధముగా మారియున్నాడు. అప్పటికే దక్షిణ దేశమున ప్రవేశించిన ఆర్యులు కొందరిని అజ్ఞానులను చేసి, కొందరిని శూద్రులను చేసి, మిగిలిన కొంతమంది ద్రావిడ బ్రాహ్మణులను లక్ష్యముగా

చేసుకొని, వారి చేతికి రాజులతో భూమాన్యములను, ధనరాశులను, కనక సొత్తులను ఇప్పించి, రాజ్యము కొరకు, రాజుల కొరకు యజ్ఞములు చేయించను మొదలుపెట్టారు. యజ్ఞ యాగాదుల వలన సులభ సంపాదన, అమిత గౌరవము, రాజులవద్ద స్థానము లభించుట చేత ద్రావిడ బ్రాహ్మణులందరూ తమ జ్ఞానమును వదలి, ఆర్యుల ఆచరణలలో లగ్నమై పోయారు. ఈ విధముగా అనేక క్రియల వలన ఏదో ఒక పద్ధతిలో ద్రావిడులలో ఆర్యుల సాంప్రదాయములను చేర్చి, తమ బలమును దక్షిణ దేశమున కూడా పెంచుకోవడము శ్రీరాముడు పుట్టకముందే జరిగి పోయినది. శ్రీరాముని తండ్రి అయిన దశరథునికి ముగ్గురు భార్యలున్నా సంతతి లేకుండెడిది. అదే అదనుగా ఎంచుకొన్న ఆర్యులు దశరథుని చెంత చేరి, యజ్ఞములు చేయుట వలన దేవతలు సంతసించి ఫలితముగా సంతతిని ఇస్తారని చెప్పి ఒప్పించి, దశరథుని చేత పుత్రకామేష్ఠి యజ్ఞము చేయించడము జరిగినది. అప్పుడే నలుగురు ఆర్యులు అక్కడయుండి అరవైమంది ద్రావిడ బ్రాహ్మణులను ఆ యజ్ఞములో పాల్గొనునట్లు చేసి, అక్కడ యజ్ఞములను చేయుటలో తర్ఫీదును చేయించారు. ఈ విధముగా శ్రీరాముడు పుట్టకముందు నుండి యజ్ఞములను ఆర్యులు ద్రావిడులకు అలవాటు చేయడము జరిగినది.

శ్రీరాముడు పుట్టిన తర్వాత రామునికి పదహారు సంవత్సరముల వయస్సులో విశ్వామిత్ర మహర్షి వచ్చి, తాము చేయుచున్న యజ్ఞములను రావణసైన్యము భంగము చేయుచున్నదనీ, అట్లు యజ్ఞ భంగము కాకుండుటకు, యజ్ఞ రక్షణకు శ్రీరామున్ని తమవెంట పంపమనీ, కొన్ని దినములు జరుగు యజ్ఞము అయిపోయిన వెంటనే తిరిగి వస్తామని దశరథున్ని అడిగి శ్రీరామున్ని, లక్ష్మణున్ని తనవెంట విశ్వామిత్రుడు తీసుకు

పోయిన విషయము అందరికీ తెలుసు. ఈ విధముగా త్రేతాయుగములో రాముడు పుట్టకముందు, పుట్టిన తర్వాత యజ్ఞముల ప్రస్తావనను రామాయణములో వినియే ఉన్నాము. త్రేతాయుగములో యజ్ఞముల ప్రస్తావన మొదలై ద్వాపర యుగమంతయు జరిగి, కలియుగము మొదటిలో కూడా పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు సర్పయజ్ఞమును చేసినట్లు విన్నాము. అంతేకాక నేటికాలములో కూడా ఎందరో బ్రాహ్మణులు ఎన్నో పేర్లుగల యజ్ఞములను చేయడము చూస్తూనే యున్నాము. ఈ మధ్యన రాష్ట్రప్రభుత్వమును నడుపు ఒక ముఖ్యమంత్రి వర్షము కొరకు వరుణ యజ్ఞమును వందమంది ఋత్విక్కులతో వేదమంత్ర ఉచ్చాటనలతో చేయడము జరిగినది. ఈ విధముగా త్రేతాయుగము మొదటినుండి మొదలైన ఆర్యుల ప్రభావము భారతదేశమంతా వ్యాపించి నేటికినీ కొనసాగుతునే యున్నది. జ్ఞానముకంటే అజ్ఞానము సులభముగా అంటుకొనునను పెద్దలమాట ప్రకారము దేవుడు చెప్పిన జ్ఞానమును ధర్మములను వదలి, మనుషులు కల్పించిన కార్యములయందు అందరూ ఆలోచనలేకుండా లగ్నమై పోవడము విచిత్రము కాదా! జ్ఞానమార్గము ఇరుకైనది, అజ్ఞాన మార్గము విశాలమైనదని ఒక ప్రవక్త చెప్పిన మాట ప్రకారము ఆదాయముతో కూడుకొన్న ప్రపంచకార్యమును ఆశ్రయించి, ఆదాయములేని దైవ జ్ఞానమును వదలివేయడము జరిగినది. అయినా మనము నష్టపోయామా లేక లాభపడినామా అని ఆలోచించక, ఎవడో ఏదో మాట్లాడితే అది సత్యమా, అసత్యమా అని ఆలోచించక, వారిమాటనే మనము మాట్లాడితే మన తెలివి ఏమైనట్లు? మన తెలివిని ఇతరులకు తాకట్టు పెట్టినట్లు కాదా?

రామాయణ చరిత్రను గ్రంథరూపముగా వ్రాసినదెవరు? వ్రాసే పాండిత్యమును కల్గిన వాల్మీకి ఆర్యుడు కాదా? అప్పటికే రావణబ్రహ్మ మీద ద్వేషమును పెంచుకొనియున్న ఆర్యులు వ్రాసిన సమాచారముతో రావణబ్రహ్మను దుర్మార్గుడు, కామాంధుడు అనడము సమంజసమేనా అని అడుగుచున్నాను. ఆ దినము రావణుడు సీతను తీసుకుపోయినది వాస్తవమే, అయినా ఆయన ఏ ఉద్దేశ్యముతో తీసుకుపోయాడో తెలియకుండా మాట్లాడితే అక్కడ మన విచక్షణ లేనట్లే కదా! రాముని చేతిలో రావణుడు ప్రాణాలు పోగొట్టుకొన్నది వాస్తవమే. జరుగబోవు భవిష్యత్తును తెలిసిన కాలజ్ఞానికి రాముని చేతిలో తన ప్రాణాలు పోతాయని తెలియదా! రావణుడు మహా జ్ఞానియై బ్రహ్మ (పెద్ద) అనిపించుకొన్నవాడు నీచ (చిన్న) కార్యములు చేయునా? అలా చేయవలసిన అవసరము లేదు. అయినా చేసిన కార్యములో ఆయన ఉద్దేశ్యము ఏమిటో తెలియకుండానే, మన భావము ప్రకారము ఆయనది తప్పు అనడములో మనమేమైనా పొరపడినామేమో ఆలోచించు కోవలసిన అవసరమున్నది. సీత స్వయంవరమునకు రావణుడు వచ్చాడని రామాయణ గ్రంథములో వ్రాశారు. సీత స్వయంవరము ఉత్తర భారత దేశములో అయినా, రావణునికి ఆహ్వానమును ఎవరు పంపారు? లంకకు పోవుటకు సముద్రమును దాటుటకు హనుమంతునికి తప్ప ఎవరికీ చేత కాలేదని చెప్పినవారు, రావణున్ని లంకకుపోయి ఎవరు పిలిచారో చెప్పలేదు. ఒకప్పుడు సీత పుట్టకముందే కైలాస పర్వతమునకు పోయి శివున్ని, శివధనస్సును, కైలాస పర్వతమును ఎత్తి తలమీద పెట్టుకొన్న బలశాలి అయిన రావణుడు, సీత ఎత్తిపెట్టిన ధనస్సును ఎత్తలేక పోయాడనీ, ఎత్తలేక భంగపడిపోయాడని వ్రాశారు. అది వాస్తవమేనా అని ఎవరూ ఆలోచించ లేదు. అంతేకాకుండా రావణుడు సీత స్వయంవరమునకు పోయాడనే మాటే శుద్ధ అబద్ధము అనుటకు ఆధారము కలదు.

సీత స్వయంవరము నాటికి రావణుడు తన భార్య మండోదరిదేవి, తన కొడుకు మేఘనాథునితో సహా లంకలో దాదాపు ఎనుబది (80) సంవత్సరముల వయస్సు కలిగియున్నాడు. ఎనభై సంవత్సరముల వయస్సులో ఆయన స్వయంవరమునకు పోవునా అని కొందరైనా ఆలోచించలేకపోయారు. శ్రీరాముడు అరణ్యవాసము కాలములో వింధ్య పర్వతముల వద్దయున్న అడవులలో రాముడు సీత లక్ష్మణుడు ఉండగా రావణుడు సీతను తెచ్చి తన లంకారాజ్యములో పెట్టినమాట వాస్తవమే అయినా, ఆనాడు సీతమీద దురుద్దేశ్యముతో రావణుడు సీతను తీసుకురాలేదు. అప్పటికి ఆయన వయస్సు ఎనభై పైమాటే. సీతను తీసుకువచ్చే విషయమును తన భార్య మండోదరి దేవికి ముందే చెప్పాడు. రాముని చేతిలో తన చావు వున్నదని, అలా జరుగుటకు రాముడు వచ్చి తనను చంపుటకు కారణముగా సీతను లంకకు తీసుకరావలెనని ముందే చెప్పాడు. ఆ విషయమును ప్రక్కనపెట్టి సీతను దురుద్దేశ్యముతో రావణుడు లంకకు తీసుకుపోయాడని ఆర్యులు ప్రచారము చేసి వ్రాశారు. ముందే ఆర్యులకు రావణుడు శత్రువుగా యుండుట వలన, సీతను తీసుకు పోవడమును సాకుగాచూపి, ఆయనను గురించి చెడు ప్రచారము చేశారు. వృద్ధాప్యములోనున్న రావణుడు ఎంతో అనుభవశాలి, మేథావి అయినందున దాదాపు రెండు పదుల సంఖ్యలో స్త్రీలను సీతకు పరిచర్యలు చేయుటకు, తోడుగాయుండుటకు ఏర్పాటు చేసి మంచి వాతావరణము కొరకు సీతను అశోకవనము అను ఉద్యానవనములో ఉంచాడు. తన నివాసమునకు దాదాపు యాభై (50) కిలోమీటర్ల దూరములో గల ఉద్యానవనములో, నీరుపారే సెలయేళ్ళ మధ్యలో ఆమె నివాసమును కల్పించి, వారమునకు ఒకమారు భార్యాసమేతుడై అశోకవనమునకు పోయి సీత ఆరోగ్య

విషయములు తెలుసుకొని ఆమెకు ఏ కొరతా లేనట్లు చూడమని తన వారికి చెప్పివచ్చెడివాడు. సీతవద్దకు పోయిన రావణుడు జరుగబోవు విషయములను ముందే చెప్పి రాముడు నా కారణమున ఇక్కడికి రావలసి యుందని కూడా తెలిపాడు. రావణబ్రహ్మ తండ్రివలె పలుకరించి తనకు ఏ లోటూ లేకుండా చూచుకొన్నందుకు సీత అయోధ్యకు వచ్చిన తర్వాతగానీ, రాకముందుగానీ, రావణున్ని గురించి ఎటువంటి ఆరోపణా చేయలేదు. ఏనాడూ రావణబ్రహ్మను గురించి సీత చెప్పిన ఆధారము లేదు. దాదాపు పదినెలల కాలము రావణుని ఆధ్వర్యములోనున్న సీత, అయోధ్యకు వచ్చిన తర్వాత ఎన్నో కష్టములను రాముని వల్ల ఎదుర్కొనినది. చివరకు గర్భిణీగాయున్న సీత అరణ్యములో అనేక బాధలు పడవలసివచ్చినది. దాదాపు పదకొండు సంవత్సరములు వాల్మీకి ఆశ్రమములోనున్న ఏ సౌకర్యమూ లేని కుటీరములలో అనేక బాధలు పడినది. పదినెలలు రావణుని కాలములో లంకలోయున్నప్పుడే ఏ కష్టమూ లేకుండా జరిగినట్లు ఎన్నోమార్లు అనుకొన్నది. సీత ఏనాడూ రావణుడు చెడ్డవాడని చెప్పక పోయినా, రామాయణమును వ్రాసినవారు ఆర్యులైన దానివలన, రావణబ్రహ్మను దుష్టునిగా చిత్రించి చూపారు. అంతేతప్ప వాస్తవానికి రావణుడు ఏ మచ్చాలేని జీవితమును గడిపిన బ్రహ్మజ్ఞాని.

దైవ జ్ఞానమును సంపూర్ణముగా తెలిసి యోగిగాయున్న రావణ బ్రహ్మను ఆర్యులు రాక్షస జాతి రాజుగా వర్ణించి చెప్పారు. లంకలోగానీ, లంక పరిసరప్రాంతములలోగానీ, లంకా రాజ్యములో ఎక్కడగానీ, రాక్షస స్వభావమున్న మనుషులు లేనే లేరు. శ్రీలంకలోయున్న వారందరూ దైవ జ్ఞానమును తెలిసినవారేగానీ, దైవజ్ఞానములేని రాక్షస స్వభావము కల్గిన వారు ఎవరూ లేరు. అక్కడి వారందరూ జ్ఞానులైయున్నందున ఆ

దేశమునకు 'శ్రీ' అను శుభకరమైన అక్షరమును చేర్చి, శ్రీలంక అని పిలుచు చున్నాము. శ్రీ అను శబ్దము ప్రపంచములో ఏ దేశమునకూ లేదని అందరూ గమనించవలెను. శ్రీలంకలో రావణుడు ప్రపంచములోకెల్ల పెద్ద యోగిగా యుండడము వలన, బ్రహ్మ అను పేరును ఆయనకు చెప్పడము జరిగినది. బ్రహ్మ అను శబ్ద బిరుదాంకితుడైన వానిని ఆర్యులు తమ శత్రువను ఉద్దేశ్యముతో, అదే పనిగా దుష్టునిగా చిత్రించితే, మనము విచక్షణ లేకుండా గ్రుడ్డిగా వారిమాటను వినవలసిన పని ఏముందని? అడుగుచున్నాను.

ఆనాడు లంకలోయున్న వారందరినీ రాక్షసులనీ, రావణుడు కూడా రాక్షసుడేననీ చెప్పినవారు, ఉత్తర భారతదేశమున పుట్టిన వారిని దేవుళ్ళుగా చెప్పుకోవడము జరిగినది. దక్షిణ భారతదేశములో కొంత భాగమును తమ ఆధీనములోనికి తెచ్చుకొన్న ఆర్యులు పూర్తిగా ఆక్రమించుకోలేక పోయారు. అటువంటి స్థలములు ద్రావిడ రాజ్యముగానే నేటికినీ పిలువ బడుచున్నవి. తమకు వశముగాని చెన్నై మొదలగు ప్రాంతముల వారికి (తమిళనాడు వారికి) నేటికినీ ద్రావిడులను పేరు కలదు. లంకకు సమీపమున ఉన్న ప్రజలందరూ కొంత దైవజ్ఞానమును కల్గి, సాంప్రదాయబద్ధమైన దేవాలయములను నిర్మించుకొని, పూర్తి ద్రావిడులుగానే యుండెడివారు. అటువంటివారిని ఆర్యులు రాక్షసులని చెప్పడము జరిగినది. అలాగే తూర్పు కనుమలని పేరుగాంచిన సుదూరముగా వ్యాపించియున్న నల్లమల అడవులలో నివసించు ప్రజలను మానవజాతియే కాదన్నట్లు వారిని కోతులని చెప్పారు. శ్రీరాముడు సీతను వెతుకుతూ నల్లమల అడవులలోనికి రాగా అక్కడ కిష్కింధ అను అరణ్య ప్రాంతములలో వాలి, సుగ్రీవులు అను కొండ రాజులు తారసపడినారు. అప్పుడు శ్రీరాముడు వారితో పరిచయమేర్పరుచుకొని వారి సహాయముతో సీతను వెదకడము, వారి

సహాయముతోనే లంకకుపోయి సీతను తెచ్చుకోవడము జరిగినది. ఆ దినము కొండరాజులుగా యుండి అడవి ప్రాంతమును పాలించు వాలినీ, సుగ్రీవున్నీ, వారి అనుచరుడు సేనాధిపతి యైన హనుమంతున్నీ, మంత్రిగాయున్న వృద్ధుడైన జాంబవంతున్నీ జంతువులుగా పోల్చి ఆర్యులు చెప్పారంటే ద్రావిడులమీద వారికి ఎంత అసూయవుందో ఇట్టే అర్థమైపోతుంది. అడవి ప్రాంతములో శ్రీరామునికి ఎంతో సహాయపడిన వారిని సహితము వదలక జాంబవంతున్ని భల్లూకమనీ, వాలి, సుగ్రీవులను, ఆంజనేయున్నీ అక్కడున్న గిరిజన ప్రజలనందరినీ కోతులుగా చెప్పడము జరిగినది. తూర్పు కనుమలలోని వారందరూ కోతులని చెప్పి, అటువంటి కోతులలో సేనాధిపతియైన హనుమంతుడను కోతి లంకవరకు సముద్రమును ఎగిరిందని చెప్పడము విడ్డూరము కాదా? వారు ఎలాగైనా చెప్పగలరు. వారికి ద్రావిడుల మీదగల కోపము, అసూయ అటువంటివి. అయితే ఆ మాటలను విని తలూపువారిని ఏమనాలి? కనీసము వారు చెప్పిన విషయమును గురించి చిన్న ప్రశ్నయినా తిరిగి అడుగకుండా గ్రుడ్డిగా విని తలూపడము వలన మన విచక్షణా జ్ఞానము ఏమైనట్లని ఎవరికీ అనిపించలేదా?

ఎక్కడైనా భూమిమీద మాట్లాడే కోతులు ఉండడము జరిగిన పనేనా, అదియు నల్లమల అడవులలో నేటికినీ గిరిజనులైన కొండ రాజులు కొండ చెంచులు అక్కడక్కడ నివసించుచున్నారు. ఒకవేళ గిరిజనులు అందముగా లేకుండ పోయివుండవచ్చును, అంతమాత్రమున వారు కోతులు కాదు కదా! ఆనాడు ఉత్తరదేశమువాడైన అయోధ్య రామున్ని దేవుడు అని అన్నారు. అదే దేవున్ని గొప్పగ పెట్టుకొని భక్తిగాయున్న అడవిబిడ్డయిన ఆంజనేయున్ని కోతియని చెప్పారు. అంతేకాక ఆ కోతికి తోక కూడా యున్నదని అందరూ

నమ్మునట్లు చెప్పుచూ, లంకలో రావణసైన్యము ఆంజనేయుని తోకకు అగ్గిపెట్టగా, ఆంజనేయుడు మండుచున్న తన తోకతో లంకారాజ్యములో కొంత అంటించి కాల్చివేశాడని చెప్పుచుందురు. ఈ విధముగా ఆర్యులు తమ ఇష్టమొచ్చినట్లు లంకలోని వారికి కొమ్ములు కోరలున్న రాక్షసులుగా వర్ణించి, తూర్పు కనుమలను పేరుగాంచిన అడవులలో నివసించువారిని కోతులుగా చేసి చెప్పారు. మాట్లాడే కోతులు ఇంతవరకూ భూమిమీద పుట్టలేదు. కావున ఆర్యులు చెప్పిన మాటలను నమ్మవలసిన పని లేదు. నాకున్న విచక్షణా జ్ఞానముతో చూస్తే లంకలోని వారు రాక్షసులు కారు, లంక సమీప అడవులలోని వారు కోతులుగారని తెలియవలెను. ఆర్యులు తమను తాము దేవతలుగా చెప్పుకొని, దక్షిణ దేశమువారిని రాక్షసులుగా చెప్పారు. అదైనా ఒక రకముగా కొంత మర్యాదగా యున్నా, దక్షిణ భారతదేశ అడవులలో నివసించువారిని కోతులనడము పూర్తి అసూయతో మాట్లాడడమే అని మాకే కాదు, మీకు కూడా బాగా అర్థము కాగలదు. సీత లంకలోనున్న విషయమును కనిపెట్టి తెలిపిన ఆంజనేయుడు కోతే అయితే, కోతుల సహాయము తప్ప మనుషుల సహాయము ఏమాత్రము దొరకని వాడు రాముడని వారే చెప్పినట్లున్నది. మనుషులు ఎవరూ పలుక లేదంటే అప్పటికి మనుషులలో శ్రీరామునికి ఏమాత్రము మర్యాదలేదని, గౌరవము లేదని తెలియుచున్నది.

శ్రీరాముడు సీతకొరకు వెదకుచూ వింధ్యపర్వత అడవులనుండి పూర్తి దక్షిణ దేశమునకు వచ్చాడు. పూర్తి దక్షిణ దేశమున ఉన్నవారంతా ద్రావిడులే కనుక వారు ఎవరూ రామున్ని గురించి పట్టించుకోలేదు. రాముడు ఆర్యుడని తెలిసి, రావణబ్రహ్మ మీద గౌరవమున్న ద్రావిడులందరూ రామున్ని గౌరవించవలెననిగానీ, సహాయము చేయవలెననిగానీ ఎవరూ

అనుకోలేదు. చివరకు నల్లమల అడవులలో ప్రవేశించిన తర్వాత కిష్కింధ పర్వత ప్రాంతములోనున్న గిరిజనులూ, వారిని పాలించు కొండ రాజులైన వాలి సుగ్రీవులు పరిచయమైనారు. వారు కూడా ద్రావిడులే అయినా వారు అడవిలో ఉండుట వలన, ఆర్యుల విషయము వారికి సరిగా తెలియక పోవడము వలన, అడవిలోనికి వచ్చిన వారిని ఆదుకొను స్వభావముండుట వలన, రామునికి వారు సహాయము చేయుటకు పూనుకొన్నారు. వారు ఎంతో గొప్ప మనస్సుతో రామునికి అండగాయుండి, అరకిలోమీటరు సముద్రమును దాటి లంక వరకు పోయి రావణ సైన్యముతో యుద్ధము చేసి, చివరకు రామునికి విజయమును సాధించిపెట్టారు. అంతవరకు రాముడు లక్ష్మణుడు ఇద్దరు తప్ప వారికి తోడు ఎవరూ లేరు. కొండ రాజులైన వాలి, సుగ్రీవులు తమ ఆధీనములోనున్న గూడెములలోని ప్రజలను వెంట పెట్టుకొనివచ్చి రామునికి సహాయము చేస్తే, కొంతయినా వారి ఎడల గౌరవ భావములేని ఆర్యులు, వారిని తోకలున్న కోతులవలె వర్ణించి ప్రజల నందరినీ నమ్మించారు.

రాముని భక్తుడు ఆంజనేయుడని రాముని గుడిలో కోతి బొమ్మను ఆంజనేయునిగా చూపించడము వలన, దానిని చూచిన ప్రజలందరూ వానర సైన్యము ఉండేదేమోనని పూర్తిగా నమ్మడము జరిగినది. వాలినీ, ఆంజనేయున్నీ వారి వెంటనున్న వారినీ కోతులుగా చిత్రించినందుకు, వారే సజీవముగా నేడు ఉంటే మేము కోతులమా అని నిలదీసి అడిగేవారు. ప్రస్తుతానికి ఆంజనేయుడూ లేడు, రాముడూ లేడు కావున ఏమిచెప్పినా సరిపోతుందను భావముతో ఇష్టమొచ్చినట్లు ఆర్యులు వ్రాయడము జరిగినది. తూర్పు కనుమలలో నివసించు వారు ద్రావిడ జాతియను ఒక్క కారణముతోనే అడవిలోనున్న వారిని కోతులుగా, ఊరిలోనున్నవారిని రాక్షసులుగా

ప్రచారము చేశారు. ఆనాటి రాక్షసులకు కొమ్ములు కోరలు ఉన్నట్లు, కోతులుగా యున్నవారికి పొడవాటి తోకలున్నట్లు చెప్పడము జరిగినది. వాస్తవానికి ఆర్యులు చెప్పినట్లు ఆ దినములలో రాక్షసులుగా చిత్రించిన ద్రావిడులకు కొమ్ములు కోరలు లేవు, కోతులుగా చిత్రించి చెప్పిన వారికి తోకలు లేవు. ఆనాడు వారు మనతోపాటు మనుషులుగానే యుండెడివారు. మన మాదిరే మాట్లాడేవారు. ద్రావిడులను గురించి ఆర్యులు వారి ఇష్టమొచ్చినట్లు చెడుగా చెప్పాలనే చెప్పారు. అయితే దానిని విన్న మనము కొంతయినా ఆలోచించక పోవడమూ, ఇది సత్యమా, అసత్యమా అని లెక్కించి చూడకపోవడమూ మన తప్పేనని చెప్పాలి.

పూర్వము హనుమంతుడు లేక ఆంజనేయుడు అనే వ్యక్తి కోతి ఆకారములోనున్న బలాఢ్యుడు అనియూ, అతను పూర్తిగా రాముని భక్తుడనియూ చెప్పడమే కాకుండా, రాముని గుడిలో రాముని పాదముల వద్ద దాసునిగా ఆంజనేయున్ని పెట్టడము జరిగినది. మొదట ఆర్యులు రాముని గుడినే కట్టించి అందులో రామున్ని ప్రతిష్ఠించి రాముని విగ్రహము కాళ్ళదగ్గర ఆంజనేయుని ప్రతిమను పెట్టెడివారు. దానితో రాముని భక్తుడు ఆంజనేయుడని అందరూ అనుకోవడము జరిగెడిది. అయితే ఆ విధముగా ప్రతిష్టించిన ఆర్యుల ఉద్దేశ్యము రాముని భక్తుడు ఆంజనేయుడనియే కాకుండా, ఆర్యుల పాదములచెంత ద్రావిడులు ఉండవలసిందేనని చూపడము వారి ముఖ్య ఉద్దేశ్యమై ఉండేది. ఆ ఉద్దేశ్యమును తెలుపు నిమిత్తమే రాముని గుడిని ప్రతి ఊరులోనూ ప్రతిష్ఠించారు. ఎక్కడైనా క్రొత్తగా ఊరు కట్టుకుంటే అక్కడ రాముని గుడిని ఊరితో పాటు కట్టు కోవాలను నియమమును కూడా ఆర్యులే ప్రచారము చేశారు. అందువలన ప్రతి ఊరిలోనూ రాముని గుడి తప్పనిసరిగా ఉండునట్లు, ఊరి పెద్దలు

నిర్ణయించుకోవడము జరుగుచున్నది. రాముని గుడిలేని ఊరు ఊరు కాదు, వల్లకాడుతో సమానమని ప్రచారము చేశారు. అందువలన చిన్నపల్లెటూరిలో కూడా ఇప్పటికీ చిన్న రాముని గుడియైనా ఉండును. ఆర్యులు ఆ విధముగానే చెప్పారు చేయించారు. ఇప్పుడు ప్రస్తుత వందసంవత్సరముల నుండి ఆంజనేయుని గుడిని కూడా కట్టుచున్నారు. ఆంజనేయుని గుడిలో ఆంజనేయుడు ఒక్కడే ఉంటాడు. కావున ఆంజనేయునికి మాత్రము గుడి కట్టకూడదని ఆర్యులు నిర్ణయించారు. అయితే ఆ విషయము అందరికీ తెలియదు గనుక ఈ మధ్యకాలములో ప్రత్యేకించి ఆంజనేయుని గుడులు కూడా తయారగుచున్నవి. అయితే ఆంజనేయుని గుడిలోని ప్రతిమకు కోతిమూతి పెట్టడము, తోకపెట్టడము నిజముగా ఆనాటి ఆంజనేయుడే వచ్చి చూస్తే, ఆ విధముగా ఆయన రూపమును తయారు చేసినందుకు చేసినవానిని ఊరక వదలడు.

వాస్తవముగా ఆంజనేయుడు దృఢ శరీరమున్న అందమైన మనిషి. సీతవరకు పోయి శ్రీరాముని సమాచారమును మొదట సీతకు తెల్పినవాడు. అలాగే లంకలో సీత సమాచారమును శ్రీరామునికి మొదట తెలిపినవాడు ఆంజనేయుడు. సీత సమాచారమును రాముని వరకు తెచ్చిన వ్యక్తి ఆంజనేయుడైనప్పుడు, ఆయనకు ఎంతటి గౌరవప్రదమైన స్థానమునైనా ఇవ్వవచ్చును. అయితే ఆర్యులు ఆంజనేయుడు ద్రావిడ జాతివాడను ఉద్దేశ్యముతో ద్రావిడులు ఎప్పటికీ ఆర్యుల కాళ్ళ దగ్గరయుండవలసిందేనను భావమును తెల్పునట్లు రాముని కాళ్ళ దగ్గర ఆంజనేయున్ని కూర్చోబెట్టారు. ఆ దృశ్యమును చూచిన నేటికాల ప్రజలందరూ ఆంజనేయుడు రాముని భక్తుడని అనుకోవడము జరిగినది. సరే ఆ విధముగా ఆంజనేయుడు తన భక్తిని కనబరుచుటకు రాముని పాదములవద్ద కూర్చున్నాడనుటకు రాముడు

ఆంజనేయున్ని తన భక్తునిగా ఎప్పుడు మార్చుకొన్నాడను ప్రశ్నకుగానీ, లేక ఆంజనేయుడే రాముని భక్తుడుగా ఎప్పుడు మారాడని అడిగిన ప్రశ్నకు గానీ జవాబు ఎవరివద్దా లేదు. వాస్తవముగా ఆంజనేయునికి శ్రీరాముని మీద భక్తి భావము ఏర్పడుటకు సమయమూ లేదు, అవకాశమూ రాలేదు. గిరిజన పుత్రులైన వాలి, సుగ్రీవులను ఇద్దరు అన్నదమ్ములు, తూర్పుకనుమల అడవులలోనున్న గిరిజన ప్రజలకు రాజులుగా ఉంటున్న కాలములో రాముడు, లక్ష్మణుడు ఇద్దరూ అడవిలోనికి ప్రవేశించి సీతను వెతుకుచూ ఆ గూడెములలోనున్న గిరిజనులను సీతను గురించి విచారిస్తూ పోవుచుండిరి. అప్పుడు అక్కడి గిరిజనులు శ్రీరామున్ని తమ నాయకుడైన సుగ్రీవునితోను, తమ రాజయిన వాలితోనూ పరిచయము చేయడము జరిగినది. శ్రీరాముడు ముందుగా కలిసిన సుగ్రీవునితోనూ, తర్వాత కలిసిన వాలితోనూ సీత విషయమును తెలియజేశారు. అప్పుడు వారు కొంతకాలము ఇక్కడే ఉండమని, అంతలోపల మా మనుషులతో వెతికిస్తామనీ, మీరు స్వయముగా ఈ అడవిలో వెతకలేరనీ చెప్పారు. వారు చెప్పిన మాటకు రాముడు, లక్ష్మణుడు ఇద్దరూ సంతోషించి కొంతకాలము అక్కడే ఉన్నారు. దాదాపు నెల లేక నెలన్నర రోజులు అక్కడున్న రాముడు వాలి, సుగ్రీవుల మధ్యనున్న తగాదాను గుర్తించి, నాకు సీతను వెతికి తెచ్చిస్తే మీకున్న తగాదాను పూర్తిగా పరిష్కారము చేస్తానని వారి ఇరువురికీ విడివిడిగా చెప్పడము జరిగినది.

గిరిజన గూడెములకు రాజును నేనంటే నేనను వైషమ్యములు అన్నదమ్ములైన వాలి, సుగ్రీవులలో కొంతకాలముగా రగులుచుండెడివి. కానీ చరిత్రలో ఆర్యులు అలా వ్రాయలేదు. వారి ఇద్దరికీ ఒకే భార్య ఉండేదనీ, భార్య కొరకు ఇరువురూ పోట్లాడేవారనీ తప్పు సమాచారమును

వ్రాశారు. అలా వ్రాస్తే ఒకే భార్య కొరకు ఘర్షణ పడడము నీచముగా కనిపించుననీ, వారికున్న గౌరవమును లేకుండా చేయవలెనను ఉద్దేశ్యముతోనే అలా వ్రాయడము జరిగినది. ఈ విధముగా వారి మధ్యలో నున్న నాయకత్వ పేచీని ఆసరాగా చేసుకొని, ఇరువైపులా సహాయము చేస్తానని ఇద్దరికీ విడివిడిగా ఒకరికి తెలియకుండా ఒకరికి రాముడు హామీ ఇవ్వడము జరిగినది. రాముడు హామీ ఇవ్వడముతో వాలి, సుగ్రీవులు ఇరువురు సీత విషయములో శ్రద్ధ తీసుకొని, తమకు ఈ సమస్య పరిష్కారమైతే సీతను వెదికి నీకు అప్పగించడములో వెనుకంజవేయమని ప్రమాణము చేసి చెప్పారు. ఆ విధముగా రాముడు తెలివిగా వాలి సుగ్రీవులను ఇద్దరినీ తన మాటను వినునట్లు చేసుకొన్నాడు.

శ్రీరామునికి మాట ఇచ్చినందుకు సీతను వెతుకు ప్రయత్నములో ఎవరైతే సరిపోతారని యోచించి, తమ అడవిలోనే కాకుండా బయట ప్రాంతములను కూడా బాగా తెలిసిన ఆంజనేయునికి సీత విషయమంతా చెప్పి రామున్ని పరిచయము చేశారు. అప్పుడు మొదటిసారిగా ఆంజనేయుడు రామున్ని చూడడము జరిగినది. అప్పుడు వాలి సుగ్రీవుల వద్ద ఆంజనేయుడు దళపతిగా (సేనాధిపతిగా) పని చేసెడివాడు. గిరిజన సేనాధిపతిని దళపతి అని అనెడివారు. ఆంజనేయుడు వారి దళపతియై నందున తనవెంట పదిమంది గిరిజనులను తీసుకొని అడవిని వెతుకుచూ పూర్తి దక్షిణ భాగమువైపు పోయాడు. ఆ విధముగా ఆంజనేయుడు తన పనిలో లగ్నముకావడము వలన శ్రీరాముడు వాలి, సుగ్రీవుల తగాదాకు కూడా పరిష్కారము కనుగొనాలని ఆలోచించాడు. అప్పుడు ఆయన మెదడులో వాలి, సుగ్రీవులలో ఒకరిని లేకుండా చేయగలిగితే సమస్య తీరుతుందని నిర్ణయించుకొన్నాడు. దానికొరకు సుగ్రీవుని మీద పూర్తి

ద్వేషముతోనున్న వాలితో కలిసి, తన ప్రయత్నములో సుగ్రీవుడు ప్రాణాలను కోల్పోతే నీకేమైనా బాధగా ఉంటుందా? అని అడిగాడు. ఆ మాటకు సమాధానముగా వాలి "సుగ్రీవుడు పోతే మొదట సంతోషపడేవాడిని నేనే, అలా జరగడము నాకిష్టమే" అన్నాడు. అదే ధోరణిలోనున్న సుగ్రీవునితో రాముడు కలిసి, నా ప్రయత్నములో వాలి ప్రాణములు పోతే నీకేమైనా బాధగా ఉంటుందా? అని అడిగాడు. సుగ్రీవుడు కూడా తన అన్న అయిన వాలి చనిపోతే తన సమస్య శాశ్వతముగా పరిష్కారము అవుతుందనీ, వాలి చనిపోవడమే మంచిదనీ చెప్పాడు. ఈ విధముగా రెండువైపులా విడివిడిగా కలిసిన రాముడు, వారియొక్క ఒకరి ఉద్దేశ్యము మరొకరికి తెలియకుండా తన మనసులోనే పెట్టుకొని, వారి ఇద్దరిలో ఒకరిని చంపుటకు రాముడు నిర్ణయించుకొన్నాడు. దానికి తగిన పథకమును తయారు చేసుకొని ఆ పథకమును ముందు వాలికి చెప్పాడు. తన పథకము ప్రకారము సుగ్రీవున్ని చంపుతానని చెప్పడము జరిగినది. దానికి వాలి సమ్మతించాడు. ఆ విధముగా ఇద్దరితో విడివిడిగా రాముడు సంప్రదించిన తరువాత, తన పథకము ప్రకారము ఇద్దరూ ఘర్షణ పడుచూ ఒకచోటయున్న సమయములో, చాటునుండి బాణముతో కొట్టి చంపుతానని చెప్పడము జరిగినది. తనమాట నిజమేనని నమ్మించుటకు దూరమునుండి పొరపాటు పడకుండుటకు ఒకరి మెడలో హారమును వేసి, ఒకరికి హారము లేకుండా ఉండునట్లు చేసి, ఇద్దరినీ ఎవరూ లేనిచోట అడవిలో పోట్లాడమని ఇరువురికీ చెప్పాడు. అంతేకాక సుగ్రీవునికి హారము వేసి, వాలిని ఖాళీ మెడతో పెట్టి, హారము వేసిన వ్యక్తిని గుర్తుగా బాణముతో కొట్టుతానని వాలికి చెప్పాడు. అలాగే సుగ్రీవునితో హారము లేని వ్యక్తిని గుర్తుగా కొట్టుతానని చెప్పాడు. ఈ విధముగా రెండువైపులా చెప్పిన రాముడు చివరకు ఎవరిని చంపాలను కొన్నాడు? అని ప్రశ్నించుకొంటే ఆ నిర్ణయము రామునికే తెలియదు.

రాముడు బాణమువేస్తే ఎవరు చచ్చినా రెండవ వానితో చెప్పిన తనమాట నెరవేరును కనుక ముందే ఏ నిర్ణయమూ తీసుకోలేదు.

రాముని పథకము ప్రకారము ఎవరూ లేని చోట వాలి, సుగ్రీవులు నిలబడి మాటలతో ఘర్షణ పడుచుండగా రాముడు వారికి కనిపించక దగ్గరగాయుండి బాణము వేయగా, అది వాలికి తగిలి అతను చనిపోవడము జరిగినది. దానితో రాముడు తనకిచ్చినమాట నెరవేరినదని సుగ్రీవుడు అనుకోవడము జరిగినది. ఒకవేళ ఆ బాణము సుగ్రీవునకే తగిలియుంటే సుగ్రీవుడు చనిపోయివుండేవాడు. అప్పుడు వాలి రాముడు తనకిచ్చిన మాట నెరవేర్చాడని అనుకొనెడివాడు. అదృష్టవశాత్తు సుగ్రీవునికి తగలకుండా రాముని బాణము నేరుగా వాలికి తగలడము వాలి దురదృష్టమనుకుంటాము. బాణము తగిలిన వెంటనే మనిషి చనిపోవును కనుక నన్ను ఎందుకు కొట్టావని అడుగుటకు కూడా అవకాశముండదు. అలా వెంటనే చనిపోవుటకు విషపూరితమైన బాణమును రాముడు ప్రయోగించాడు. రాముడు ప్రయోగించిన బాణమునకు రాతికప్ప చర్మపు బుడిపెల నూనెనూ, అలాగే రాతిబల్లి చర్మ బుడిపెలలోని జిగురునూ పట్టించి పెట్టడము జరిగినది. రాతికప్ప చర్మములోని నూనె, రాతిబల్లి చర్మములోని బుడిపెల జిగురు రెండూ అధిక విషప్రభావము కలవి. అవి చర్మములోనికి చొచ్చుకొని పోతే మనిషి అరనిమిషములో అపస్మారక స్థితిలోనికి పోయి, ఐదారు నిమిషములలో చనిపోవును. బాణము తగిలిన తర్వాత రెండవ మాట మాట్లాడే అవకాశము ఏమాత్రముండదు. అటువంటి విషమును రాముడు తన బాణమునకు పూసి కొట్టడము వలన, బాణము తగిలిన వాలి వెంటనే మారుమాట మాట్లాడకుండా చనిపోవడము జరిగినది.

ఆ సంఘటనతో సుగ్రీవుడు సంతోషపడి, ఆ విషయమును ఎవరికీ తెలియకుండా చేసి, ఎవరో వేసిన బాణముతో చనిపోయినట్లు చిత్రించడము జరిగినది. రాముడు చంపినట్లు తెలియకుండా చేశాడు. వాలి చనిపోయిన విషయము సీతను వెతుకుటకు పోయిన ఆంజనేయునికి కూడా తెలియదు. అప్పగించిన పనిని చేయాలను దీక్షతోయున్న ఆంజనేయుడు దాదాపు మూడు నెలల కాలము సీతను అన్వేషించి భారత భూభాగములో సీత లేదని తెలిసి, చివరకు దగ్గరగాయున్న లంకలో చూడాలనుకొన్నాడు. అప్పుడు తనవెంటవచ్చిన వారిని, వారి గూడెములకు తిరిగిపంపి, తాను ఒక్కడు లంకవైపుకు పోయాడు. అప్పటి కాలములో భారతదేశమునకు లంకకు మధ్య దాదాపు అర్థకిలోమీటరు దూరముండెడిది. అది కూడా పూర్తి నీరుతో లేకుండా అక్కడక్కడ కొన్ని ఇసుక దిబ్బలు నీటిలో తేలియుండేవి. ఇసుకదిన్నెల మధ్య నీరు లోతు తక్కువగాయుండుట వలన ఈదే అవసరము కూడా లేకుండా కాళ్ళలోతు, నడుములలోతు, గొంతులోతు ఉన్న నీళ్ళలో నడిచిపోయెడివారు. ఆంజనేయుడు దాదాపు ఏడు అడుగుల ఎత్తుగలిగిన ఆజానుబాహుడు అయినందున, కొద్దిపాటిగా నున్న సముద్రమును నడిచి దాటిపోయాడు. ఆ కాలములో ఇప్పటివలె దేశ సరిహద్దు సమస్యలు లేవు. అందువలన ఇటువైపు ప్రజలు అటువైపు, అటువైపు ప్రజలు ఇటువైపు అవసర నిమిత్తము, వ్యాపార నిమిత్తము వచ్చి పోయెడివారు. అలాగే ఆంజనేయుడు లంకలోనికి పోయినా, ఎవరూ అతనిని పట్టించు కోలేదు. ఆంజనేయుడు లంకలోనికి పోయిన తర్వాత సీతను తెచ్చి రావణుడు ఆశోకవనములో ఉంచాడను విషయమును, అక్కడి ప్రజల ద్వారా ఆంజనేయుడు తెలుసుకోవడము జరిగినది.

అంతవరకు నిర్భయముగా సాగిన సీత అన్వేషణ, సీత ఆచూకీ తెలిసిన తర్వాత ఆంజనేయునికి సీతతో కలువడము కొంత కష్టమనిపించి

నది. ఎందుకనగా ఒక రాజు ఆధీనములోనున్న వారితో చాటుమాటుగా ఎవరూ కలిసే అవకాశముండదు. రాజుగారి అనుమతితోనే సీతను కలియుటకు అవకాశముంటుంది. అయితే సీత ఆచూకీ కొరకు వచ్చానని రావణునికి తెలిస్తే, తనను బందీచేయునని ఒకవైపు ఆంజనేయునికి అనిపిస్తూయుండినా, ఎటుతిరిగీ కొంత ఆలస్యమైనా ఫరవాలేదు, రాముని విషయము సీతకు తెలుపాలని ఆంజనేయుడు నిర్ణయించుకొన్నాడు. ఒక దినము మధ్యాహ్న సమయములో ప్రాకారములేని అశోకవనములోనికి ఆంజనేయుడు ప్రవేశించి, అటూ ఇటూ తిరుగుచూ చివరకు సీతయున్న స్థలమును చూచాడు. సీత సమీపములో ఇద్దరు స్త్రీలు ఉండగా నేరుగా వారివద్దకు పోయి దాహముగా ఉందని, దారితప్పి వచ్చానని, నీరిచ్చి దాహము తీర్చుమని, బయటకు పోవు దారిచూపమని అడిగాడు. అప్పుడు అక్కడున్న స్త్రీలు ఇది నిషిద్ధ ప్రదేశము. ఎవరూ అనుమతి లేనిది రాకూడదని చెప్పి ఒకరు పోయి నీరు తెచ్చిఇచ్చారు. ఒక స్త్రీ అక్కడుండగా ఆమెతో మాట్లాడడము సీత గమనిస్తుండగా, రామునివద్ద నుండి తెచ్చిన రాముని చేతి ఉంగరమును సీతవైపునకు అక్కడున్న స్త్రీ గమనించకుండా వేయడము జరిగినది. తన ముందర పడిన ఉంగరము రామునిదేనని గ్రహించిన సీత దానిని తీసిపెట్టుకొన్నది. అయితే సీతతో మాట్లాడే అవకాశము ఆంజనేయునికి ఏమాత్రము దొరకలేదు. అంతలోనే నీరు మరొక స్త్రీ తెచ్చి ఇవ్వడము, ఆంజనేయుడు నీరు త్రాగగానే అక్కడ సమాచారమును అందుకున్న భటులు అక్కడికి వచ్చి ఆంజనేయున్ని నీవు ఎవరు? అని ప్రశ్నించి, ఆంజనేయుడు ఏదో చెప్పబోవునంతలో ఇక్కడేమీ చెప్పవద్దు, నీవు చెప్పవలసినది రాజుగారి సమక్షములో చెప్పమని, ఆంజనేయున్ని బంధించి తీసుకుపోవడము జరిగినది.

రావణబ్రహ్మ ఎంత గంభీరవదనము గలవాడో, మొట్టమొదట ఆంజనేయుడు చూచాడు. ఆంజనేయుడు ఇందూదేశములోని (భారత దేశములోని) గిరిజనుడని తెలుసుకొన్న రావణబ్రహ్మ, అతను ద్రావిడ జాతివాడేనని తెలిసి ఆంజనేయున్ని సముద్రతీరములో వదలి తన దేశమునకు పొమ్మని చెప్పాడు. అంతేతప్ప ఆ దినము ఆంజనేయున్ని పల్లెత్తు మాటకూడ అనలేదు. చరిత్రలో ఆంజనేయుని తోకకు అగ్ని పెట్టారని చెప్పడము శుద్ధ అబద్ధము. ఆంజనేయునికి తోక వుండేదని నమ్మించుటకు అలా వ్రాశారు. ఆంజనేయుడు మొదట కొంత భయపడినా, రావణబ్రహ్మను చూచిన తర్వాత, ఆయన మాటతీరును చూచిన తర్వాత, ఆంజనేయునిలోని భయము పోయినది. ఆంజనేయుడు తిరిగి తన అరణ్యమునకు వచ్చిన తర్వాత వాలి చనిపోయినట్లు తెలుసుకొన్నాడు. అయితే రాముడే వాలిని చంపినట్లు ఆంజనేయునికి తెలియదు.

ఆంజనేయుని ద్వారా సీత జాడను తెలుసుకొన్న రామలక్ష్మణులు, సుగ్రీవుడు మొదలగువారు ఆంజనేయుడు చేసిన సాహసమును మెచ్చుకొని, తర్వాత సీతను రావణబ్రహ్మ వద్దనుండి ఎలా తేవాలని యోచించారు. అసలుకు రావణుడు సీతను ఎందుకు తీసుకుపోయాడో కూడా తెలియని స్థితిలోయున్న సుగ్రీవుడు మొదలగువారు, తమకు పెద్దగా, మంత్రిగాయున్న జాంబవంతుని సలహామేరకు మొదట సంధిదూతను పంపి విషయమును తెలుసుకోవాలనుకొన్నారు. అలాగే ఒక పదిమంది పెద్దలను సంధిగా పంపడము జరిగినది. సీత విషయమై వచ్చారని తెలుసుకొన్న రావణుడు "నేను బంధించినది ఆర్యజాతి రాముని భార్యను, రాముడు ద్రావిడులకు చేసిన ద్రోహమునకు బదులుగా యజ్ఞ రక్షణలో మావారిని చంపినందుకు ఆ పనిని చేశాను. అయితే మా సమక్షములో ఆమె సురక్షితముగాయున్నది.

మీరు ఆమెను తీసుకుపోవాలంటే నన్ను నా సైన్యమును యుద్ధములో జయించి తీసుకుపోవలసియుంటుంది" అని చెప్పాడు. అప్పుడు అక్కడికి పోయినవారు వెనుతిరిగి సుగ్రీవుడివద్దకు వచ్చి రావణబ్రహ్మ చెప్పిన విషయమునే చెప్పారు. ఆ మాటలు విన్న సుగ్రీవుడు రాముడు తనకు చేసిన సహాయమునకు, ఆయనకు తానుమాట ఇచ్చినట్లు సీతను లంకనుండి విడిపించి తెచ్చి రామునికి ఇవ్వాలని వారికి చెప్పాడు. అప్పుడు తమ రాజు అయిన సుగ్రీవుడి మాటను అందరూ సమ్మతించారు. తమ రాజుమాటే మామాట అని చెప్పు దళనాయకుడు ఆంజనేయుడు, వారి నాయకత్వములోని గిరిజనులందరూ సుగ్రీవుని మాటకు కట్టుబడియున్నా మని చెప్పారు. దానితో రాముడు, లక్ష్మణుడు ఇద్దరూ సంతోషపడి, వారు కూడా యుద్ధరంగములోనికి వచ్చి రావణునితో పోరాడుతామని నిర్ణయించు కోగా, చెప్పిన మాట ప్రకారము సుగ్రీవునితో సహా అందరూ బయలుదేరి పోయారు. అది త్రేతాయుగము యొక్క కాలమైన దానివలన యుద్ధములో ఇప్పటి నిబంధనలు, నియమములులేవు. శ్రీరామునితోపాటు సుగ్రీవుడు తన గిరిజన సమూహముతో సముద్రమును దాటి లంకవరకు పోయారు.

లంకనుండి భారతదేశమునకు, భారతదేశమునుండి లంకకు అప్పుడప్పుడు కొందరు వచ్చి సముద్రము దాటి రావడము, పోవడము జరుగుచుండుట వలన రాముడు, సుగ్రీవుడు, ఆంజనేయుడు, లక్ష్మణుడు, వారి అనుచరులు ఒకేమారు కాకుండా నాలుగు గుంపులుగా రాత్రిపూట సముద్రమును దాటి లంకలో చేరి సముద్ర తీరమున ఒకచోట యుండి సీత విషయమును తమ వార్తాహరుని చేత రావణబ్రహ్మకు లేఖను పంపడమైనది. లేఖలో సీతను రామునికి అప్పగించవలెననీ లేకపోతే యుద్ధము తప్పదనీ చెప్పగా, రావణుడు దానికి జవాబుగా యుద్ధమే

చేయమని వ్రాసిపంపాడు. అలా ప్రారంభమైన యుద్ధములో తాను చనిపోవలెనని రావణబ్రహ్మకు ముందే తెలుసు. అందువలన ఆ తతంగమును అంతటినీ ఏమాత్రము తొణకకుండా నడిపించి చివరికి జరుగవలసినది జరుగునట్లు రావణుడు చేశాడు. ఒక ఆర్యుడు వచ్చి ద్రావిడ దేశమైన లంకలోనే ద్రావిడ రాజులలో గొప్పవాడైన రావణబ్రహ్మను చంపవలెనని ముందే నిర్ణయముండుట వలన దానిప్రకారమే జరుగునట్లు రావణుడు చేశాడు. అలా కర్మ నిర్ణయము లేకపోతే వేయిమంది రాముళ్ళయినా రావణున్ని చంపేదానికి వీలులేదు. ఎందుకనగా! ఆయన యోగీశ్వరుడైనందున ఆయన ప్రాణమును ఆయన ఇష్టమొచ్చినప్పుడే వదలగలడు. ఆయన ఇచ్ఛప్రకారమే మరణము రాగలదు. ఆయన అనుమతి లేనిది మరణమురాదు. కనుక ఆయనను 'ఇచ్ఛామరణుడు' అని అనవచ్చును. ***రాముని బాణముతోనే రావణుడు చచ్చాడని అందరూ అనుకొనినా, రావణుడు మాత్రము రామునితో బాణమును వేయించుకొని తన ఇష్టముతోనే చనిపోయాడు.*** రావణ మరణము యొక్క ఆంతర్యము ఎవరికీ తెలియకపోయినా, బాహ్యముగా రాముని బాణముతో చనిపోయాడని అందరూ అనుకొన్నారు.

శ్రీరాముని చేతిలో రావణుడు చనిపోయిన విషయమును తెలుసుకొన్న ఆర్యులు చాలా సంతోషించారు. అంతవరకు తమకు సింహ స్వప్నముగాయున్న రావణుడు, తమ ఆర్యజాతివాడైన రాముని చేతిలో చనిపోవడము ఆర్యులకు పట్టలేని ఆనందమైపోయినది. రాముని మూలముగా రావణుడు చనిపోవడమును రామాయణముగా వ్రాసుకొన్నారు. అలా వ్రాసుకొన్న రామాయణములో అదే అదనుగా రామున్ని దేవునిగా, విష్ణువు అవతారముగా వర్ణించడమే కాకుండా, రావణబ్రహ్మను రాక్షసునిగా,

దుర్మార్గునిగా, కామాంధునిగా వర్ణించారు. రావణుడు చనిపోవునంతవరకు దక్షిణ దేశములో యజ్ఞములు చేయుచున్నా, ద్రావిడ బ్రాహ్మణులకు యజ్ఞములు చేయు విధానమును నేర్పించుచున్నా అక్కడ రావణ సైన్యమువచ్చి చేయుచున్న వారిని హింసించి, జరుగుచున్న యజ్ఞమును ఆర్పివేసి ధ్వంసము చేసి పోయెడివారు. ఆర్యుల కార్యకలాపములను ద్రావిడులు ఎవరూ వ్యతిరేకించకున్నా, లంకలోయున్న రావణుడు దక్షిణదేశములో యజ్ఞములు చేయుటగానీ, వేదములను చదువుటనుగానీ జరుగనీయక ఆటంకపరిచే వాడు. అలా చేయడము వలన కొందరు ప్రజలకు రావణుడు చేయుపని మంచిది కాదనిపించినా, దైవజ్ఞానమును తెలిసిన జ్ఞానులు ఆదిలో దేవుడు చెప్పినట్లు, సూర్యుడు మనువుకు చెప్పినట్లు రావణుడు చేయుచున్నాడనీ, జ్ఞానము ప్రకారము యజ్ఞములు, వేదములు, తపస్సులు అధర్మములనీ, అటువంటి అధర్మముల కార్యములను అడ్డుకొనుచూ రావణబ్రహ్మ మంచి చేయుచున్నాడని కొందరనుకొనెడివారు.

అప్పటికాలములో ఆర్యులు ద్రావిడులకంటే రెండింతలుగా ఇందూ దేశమైన భారతదేశములోనికి రావడమేకాక, ద్రావిడులలోని జ్ఞానమును లేకుండా చేసి తమ ఆచరణలను ద్రావిడులలో నింపాలనుకొన్నారు. అలా తమ ఆచరణలకు అలవాటు చేసి ద్రావిడులను ఎప్పటికీ తమకాళ్ళ దగ్గర ఉండునట్లు చేయాలనుకొన్నారు. అదే విధముగా ద్రావిడులను మార్చుచూ వచ్చారు. అయితే పూర్తి దక్షిణదేశమైన ఇప్పటి తమిళనాడు లంక ప్రాంతములలో ద్రావిడులు మారిపోకుండ రావణుడు అడ్డుపడడము జరిగినది. అందువలన తమిళనాడు లంక ప్రాంతములలో ఆర్యులకు ఇప్పటికీ పెద్ద ఆదరణలేదు. ఇప్పటికీ రామున్ని చెడుగా, రావణబ్రహ్మను మంచిగా చెప్పుకొనువారు పూర్తి దక్షిణభాగమున కలరు. పూర్వము ఆర్యులు

చనిపోయినా, వారి ఆశయమును నేరవేర్చుటకు వారి సంతతి తయారై ఆర్యుల కార్యములను జరుపుచూ వచ్చారు. ఆ విధముగా ఆర్యులు తమ ఉద్దేశ్యమును ఈనాటికీ మానుకోలేదు. అయితే ద్రావిడులైనవారు త్రేతా యుగములోనే వారి జ్ఞానమును కోల్పోయి, మేము ద్రావిడులము జ్ఞానులము (ఇందువులము) అను మాటను పూర్తిగా మరిచిపోయి, భారతదేశములోని చాలా ప్రాంతములవారు ఆర్యుల క్రింద బానిసలై పోయారు. ద్రావిడులు తమ చరిత్రను తామే మరచిపోయి, ఆర్యుల ప్రేరేపణచేత ద్రావిడులు ద్రావిడులనే హింసించుకొనుచున్నారు. ఇప్పుడే కాదు రామాయణ కాలమైన త్రేతాయుగములో జరిగిన యుద్ధము కూడా అదియే. అడవిలో గిరిజనులైన ద్రావిడులకు, లంకలో పురజనులైన ద్రావిడులకు మధ్యలో జరిగిన యుద్ధము రామాయణ యుద్ధము. ఆనాడు ఆర్యుల చేత ప్రేరణపొంది, వారి చేతిలో కీలుబొమ్మలై గిరిజన ద్రావిడులైన సుగ్రీవ, జాంబవంత, ఆంజనేయులు పురజన ద్రావిడులైన రావణునితో ఆయన సైన్యముతో పోట్లాడలేదా? ఆనాడు రామాయణములో జరిగిన సూత్రమునే నేడు కూడా ఆర్యులు అమలు చేయుచూ, తాము ప్రేరేపించి ద్రావిడులచేత ద్రావిడులను హింసించి తమవైపు మార్చుకోవాలని ప్రయత్నిస్తున్నారు. మేము ద్రావిడులము అను స్పృహలేని ద్రావిడులు, గ్రుడ్డిగా ద్రావిడుల మీద దాడులు చేయుటకు ప్రయత్నించుచున్నారు. ఇదంతా ద్రావిడులలోని అజ్ఞానము, ద్రావిడుల అజ్ఞానమే నేడు కూడా ఆర్యులకు పెట్టుబడిగా ఉంటూ, ద్రావిడులనే మార్చుటకు ఆర్యుల పాదములచెంత పడుటకు అవకాశము కల్పించుచున్నది.

అడపా దడపా ఎక్కడైనా ద్రావిడ స్వభావము కలవారుంటే, వారిని కూడా మార్చుటకు ఆర్యులు నేటికినీ ప్రయత్నిస్తున్నారంటే ఆర్యుల పట్టుదల, వారి ఉద్దేశ్యము ఎంత బలమైనదో ఊహించుకోవచ్చును. ఆర్యులు తెలివైన

వారు, మేధావులని మొదటే చెప్పాము. ద్రావిడులలో ఆ మేధాశక్తి లేదని ఒప్పుకోక తప్పదు. ఆర్యుల చేతిలో ద్రావిడులు ఆటబొమ్మలవలె నేటికినీ ఆడింపబడుటయే దానికి నిదర్శనము. ఒకప్పుడు ప్రపంచ వ్యాప్తముగా గొప్ప జ్ఞానులు అని పేరుగాంచి, జ్ఞానులదేశమని అర్థము నిచ్చు ఇందూ దేశము అని ప్రపంచ ప్రజలచేత అనిపించుకొని, మూడు ఆత్మల జ్ఞానము తెలిసినవారను అర్థముతో ద్రావిడజాతి అని పేరుగాంచి, చివరకు మన చరిత్రను మనమే మరిచిపోయిన ద్రావిడులుగా మిగిలిపోయాము. ఇందూ శబ్ధమును వదలి చివరకు హిందూశబ్ధముతో హిందువులుగా ఉచ్ఛరించ బడుచున్నాము. దేహిభక్తిని వదలి, దేశభక్తిలో పడిపోయిన ద్రావిడులు రామలక్ష్మణ ప్రేరణ చేత, సుగ్రీవ హనుమంతుని సైన్యము ద్రావిడేశ్వరుడైన రావణబ్రహ్మ మీదికి పోయినట్లు, నేడు కూడా తమ చరిత్రను మరిచిపోయిన ద్రావిడులు కొందరు, ఆర్యుల ప్రేరణచేత ఎందరో ద్రావిడులు ఒక సంఘమును లేక ఒక గుంపును సుగ్రీవ సైన్యమువలె తయారు చేసుకొన్నారు. దానిపేరు జై ఆంజనేయ సంఘము లేక జై హనుమాన్ దళము అని పేరు పెట్టుకొని తిరుగుచూ ఒక్కరు లేక ఇద్దరు ఆర్యులు పై నుండి ప్రేరేపించితే, తాము ఎవరితోనైనా ఘర్షణ పడేదానికి సిద్ధముగా యున్నారు. అటువంటి సంఘములలో చదువుకొన్నవారు, సైన్సు తెలిసినవారు, విజ్ఞానులు, ఎంతో తెలివైనవారు కూడా ఉన్నారు. అయితే ఆనాడు ద్రావిడులమైన మనము ద్రావిడులలో ముఖ్యుడైన రావణబ్రహ్మ మీదికే యుద్ధానికి పోవుచున్నామే అని ఆలోచించకుండా పోయినట్లు, నేడు కూడా జై హనుమాన్ దళముగానీ, జై ఆంజనేయ సంఘముగానీ మనము ఎవరిమీదికి దాడికి పోతున్నామని ఏమాత్రము ఆలోచించడములేదు. ఆర్యులు ద్రావిడుల వ్రేలుతో ద్రావిడుల కన్నునే పొడుస్తున్నా, మన కన్నును మనమే ఎందుకు పొడుచుకొను చున్నామని ఆలోచించక పోవడము ఆశ్చర్యము. ఆంజనేయ భక్తులమని

చెప్పుకొనువారుగానీ, హనుమాన్‌దళము వానినని చెప్పుకొనువాడుగానీ ఇక్కడ దక్షిణ దేశములో అందరూ ద్రావిడులే యున్నారు. అయితే ఆంజనేయునికి కోతిమూతి, జంపు తోక ఉండేదా? అని ఆలోచించక అటువంటి ఆకారమున్న బొమ్మనే పెట్టుకోవడము జరుగుచున్నది. ఇంతవరకు అటువంటి జాతి పుట్టనేలేదని ఒక ప్రక్క సైన్సు చెప్పుచున్నా, చరిత్రలో ఎక్కడాలేని రాముని కాలములోనే మాట్లాడే పెద్దకోతులు, మనిషిని పోలిన కోతులు ఉండేవా అని కొద్దిగా అయినా యోచించలేకపోవుచున్నాము.

ఆనాడు రావణయుద్ధములో వాడుకొన్న గిరిజన ద్రావిడులను, అక్కర తీరిపోయిన తర్వాత కోతులవలె పోల్చి చరిత్రలో హీనముగా వ్రాసినా, ఇది మంచా లేక చెడా అని గుర్తించలేని స్థితిలో నేటి ద్రావిడులు ఉండడమే కాక, యుద్ధములో ముఖ్యపాత్రపోషించిన ఆంజనేయున్ని ఒక కోతిగా పోల్చి చెప్పితే బాగుందా? రామాయణ చరిత్రలో రామునికి సహాయమందించిన వారిలో ఆంజనేయుడు ముఖ్యుడుకాగా, ఆయన చేసిన మేలును మరిచి ఆర్యుడైన రామునికి భక్తుడు బానిస అన్నట్లు ఆంజనేయున్ని చూపారు. మనము భక్తుడనుకొనినా, వారిలెక్కలో బానిసగానే ఉండునట్లు రాముని కాళ్ళ దగ్గర ఆంజనేయున్ని ఉంచడము జరిగినది. ఒకవేళ ఎవరైనా రాముని భక్తుడు ఆంజనేయుడు అనేదానికి, కిష్కింధ అరణ్యములో ఒక్కమారు తప్ప రాముని పరిచయమేలేని ఆంజనేయుడు ఎప్పుడు రామున్ని గొప్పగా కనుగొన్నాడో చెప్పగలరా? చెప్పలేరు. లంకలో విజయమును సాధించిన తర్వాత ఆంజనేయుడు రెండవమారు రామునితో కలువలేదు. ఆయన తనవారైన ద్రావిడులవద్దనే ఉండిపోయాడు. రాముడు ఒక యువరాజుగా, అయోధ్యలో దశరథ కుమారునిగా ఆంజనేయునికి పరిచయమయ్యాడు తప్ప, ఏనాడైనా ఆంజనేయునికి రాముడు దైవజ్ఞానమును బోధించాడా

లేక నేను దేవున్నని చెప్పాడా? ఏమీ చెప్పకనే రామునికి ఆంజనేయుడు ఏ విధముగా భక్తుడయ్యాడని ఎవరైనా ఆలోచించారా? లేదు. ఎవరో ఏదో చెప్పితే గ్రుడ్డిగా నమ్మడము తప్ప మనకంటూ చూపులేదా? చూపువుంటే ఇప్పటికైనా ఆంజనేయుడు కోతికాదు సుందరవదనుడైన ఏడడుగుల ఆజానుబాహునిగా చూడండి. ఆంజనేయుడు అందముగా, ఆరోగ్యముగా, ఏడడుగుల ఎత్తుగల వానిగా ఎందుకు పుట్టాడో చూస్తాము. ఆనాడు గిరిజన ద్రావిడజాతిలో ఆంజనేయుడు రెండు సంవత్సరముల పిల్లవాడుగా యున్నప్పుడే, వారి ఇంటిముందర నీటి నిలువకొరకు తీసిన లోతు తక్కువ గుంతలో పడడము జరిగినది. రాత్రిపూట ఆరుబయట తల్లి అంజనాదేవి ప్రక్కలో పడుకొని యున్న బాలుడైన ఆంజనేయుడు, నడిజామున నిద్రనుండి లేచి మోకాళ్ళ మీద దొగ్గాడుచూ గుంతవైపుపోయి, గుంతలోనికి చూడడము జరిగినది. ఆ దినము పౌర్ణమి అయినందున గుంతలోనికి చూచిన బాల ఆంజనేయునికి, నిలిచిన నీటిలో పైన నడి ఆకాశములోని గుండ్రని చంద్రుడు కనిపించాడు. అద్దమువలెనున్న నీరులో ఆకాశములోని చంద్రుడు తనముందర నీటిలో యున్నట్లు కనిపించాడు. ఆ దృశ్యమును చూచిన ఆంజనేయుడు చంద్రున్ని తెల్లని పండులాగ పోల్చుకొని, ఆ పండును పట్టుకొనుటకు ముందుకు పోయి మోకాలులోతు కూడా లేని నీటిలో పడిపోయాడు. నీటిలో పడిన వెంటనే ఏడ్వను మొదలుపెట్టాడు. అప్పుడు దగ్గరేయున్న తల్లి మిగతా వారు అందరూ లేచి బాల ఆంజనేయున్ని ఎత్తుకోవడము, బుజ్జగించడము జరిగినది. ఆంజనేయుడు గుంతవరకు పోయి ఎందుకు గుంతలో పడినదీ ఎవరికీ తెలియదు. అంతటితో ఆ సమస్య తీరిపోయినది, దానిని గురించి ఎవరూ అనుకోలేదు.

అయితే బాల ఆంజనేయుడు ప్రొద్దుపొడవకముందే లేచి ఆడుకొనేవాడు. అలాగే మరుసటిరోజు లేచి ప్రొద్దు పొడుచు సమయమునకు

బయట ఆడుకొనుచూ ఉదయించుచున్న సూర్యున్ని చూడడము జరిగినది. అప్పుడు ఆంజనేయుడు కేరింతలు కొట్టుచూ సూర్యున్ని చూచి ఎగురుచూ ఉండడమును తల్లి గ్రహించినది. అదే విధముగా ప్రతిరోజు ఉదయమే ఉదయించుచున్న సూర్యున్ని చూడడమూ, సూర్యుని వైపు వేలును చూపుచూ సంతోషపడడమును తల్లి గమనించి, జరుగుచున్న విషయమును పెద్దవాడైన, గొప్ప తెలివైనవాడైన జాంబవంతునికి తెలియజేసింది. అదివిన్న జాంబ వంతుడు బాగా యోచించి తర్వాత వచ్చిన పున్నమి రోజు రాత్రిపూట చంద్రుడు పైకి వచ్చిన తర్వాత ఆంజనేయున్ని లేపి చంద్రున్ని చూపడము జరిగినది. అప్పుడు చంద్రున్ని చూచిన ఆంజనేయుడు సూర్యోదయములో సూర్యున్ని చూచినట్లు సంతోషపడినాడు. అప్పుడు జాంబవంతునికి కొంత విషయము అర్థమై, ముందు జరిగిపోయిన పున్నమిరోజు ఆంజనేయుడు నీటిలోనే పైనగల చంద్రున్ని చూచాడనీ, అదే ఆకారములోనున్న ఉదయించు సూర్యున్ని చూచినప్పుడు చంద్రబింబ ఆకారమే కనిపించుచున్నదనీ ఆంజనేయుడు అనుకొన్నట్లు జాంబవంతుడు గ్రహించాడు. ఆ విషయము నంతటినీ ఆంజనేయుని తల్లికి పూసగుచ్చినట్లు చెప్పాడు. అలా చెప్పడమే కాకుండా, ప్రతి దినము ఆంజనేయున్ని గుడ్డలు లేకుండా వెన్నెలలోనే పడుకోబెట్టమని చెప్పాడు.

అలా వెన్నెలలో పడుకోబెట్టితే ఆంజనేయుడు చంద్రుని వైపే చూస్తూ నిద్రపోవును అనియూ, వెన్నెలలో నిద్రపోవుట వలన చంద్రుని కిరణములు ఆంజనేయుని శరీరము మీద ప్రతీ దినము పడును అనియూ, చంద్రకిరణములు నిత్యము ఆంజనేయుని శరీరము మీద పడుట వలన చంద్రకిరణములలో గల ఔషధ గుణములు, ఔషధ ప్రభావములు ఆంజనేయుని శరీరమును చేరి, ఆంజనేయున్ని వజ్రకాయము గలవానిగా

చేయుననియూ, ఈ విధముగా నిత్యము ఆరుబయట శరీరమంతా వెన్నెల తగులునట్లు పన్నెండు సంవత్సరములు ఎవడైనా పడుకోగలిగితే, అటువంటి వానికి శరీరము దృఢముగా పెరుగుటయేగాక, రోగములు రాని ఆరోగ్య శరీరముగా ఉండునని జాంబవంతుడు తెలుపగా, అప్పటినుండి ఆంజనేయుని తల్లి జాంబవంతుడు చెప్పినట్లే చేసినది. పన్నెండు సంవత్సరములు ఏకధాటిగా ఒక్కరోజు కూడా మానుకోకుండా బయట పడుకొనెడి వాడు. ఆ విధముగా పడుకోవడము వలన అమావాస్య ముందు వెనుక రెండుమూడు రోజులు తప్ప మిగతా అన్ని రోజులలో చంద్రకిరణములు ఆంజనేయుని శరీరమును త్రాకుచుండెను. చంద్ర కిరణములు త్రాకుట వలన ఆయన దృఢకాయము గలవాడే కాకుండా, ఏడు అడుగుల ఎత్తుకూడా పెరిగాడు. అలా చంద్రకిరణముల ద్వారా ఏడు అడుగుల దృఢకాయము లభించడమేకాక, మరియొక మేలు కూడా జరిగినది.

చంద్రుని వెన్నెలలోని చంద్రకిరణములలో ఔషధ ప్రభావముండును కనుక దృఢకాయము పెరిగినది. అలాగే చంద్రకిరణములలో ఔషధ గుణములే కాకుండా, జ్ఞాన కిరణములు కూడా ఉండుట వలన, శరీరముతో పాటు జ్ఞానజిజ్ఞాస కూడా పెరగడము అలాగే ఆత్మ ద్వారా ఆత్మజ్ఞానము రావడము జరుగుచుండేది. పన్నెండు సంవత్సరములు వెన్నెలలో పడుకోవడము వలన ఇటు ఆరోగ్య బలమూ, అటు జ్ఞానబలమూ రెండూ కలిగినవనియు చెప్పవచ్చును. అప్పటికాలములో ఆంజనేయుడు గిరిజన ద్రావిడ జాతివాడైన దానివలన వారి పెద్దల ద్వారా త్రైత సిద్ధాంత జ్ఞానము, ద్రావిడ అర్థమునిచ్చు మూడు ఆత్మల జ్ఞానము ఆంజనేయునికి బాగా వంట బట్టినది. చంద్రుని చూపు అయిన వెన్నెల ద్వారా ఆంజనేయుని శరీరములో

అసలైన జ్ఞానము ప్రతిష్ఠింపబడినది. అందువలన ఆంజనేయుడు ఇరవై సంవత్సరములకే గొప్ప జ్ఞానియైపోయాడు. ఆయనకు తెలిసిన జ్ఞానము మూడు ఆత్మల జ్ఞానము కాబట్టి, వ్యక్తి పూజ చేయుటకు త్రైత సిద్ధాంత జ్ఞానము ఒప్పుకోదు కాబట్టి, వ్యక్తి పూజ ఇందులో ఉండదు. వెన్నెలలో పన్నెండు సంవత్సరములు చిన్న గోచీతోగానీ, చెడ్డీతోగానీ ఉంటూ శరీరమంతా వెన్నెల పడునట్లు పడుకోగలిగితే, ఎవరికైన ఇటు ఆరోగ్యము అటు జ్ఞానము రెండూ లభించును. అడవిలోని ద్రావిడజాతి వారికి ఆర్యుల గాలి సోకని కారణమున రాముడు కిష్కింధకు వచ్చినప్పుడు వారు పూర్తి జ్ఞానులుగానే యుండిరి. ఆపదలో నున్నవారిని ఆదరించు స్వభావముండుట వలన ఆనాడు అరణ్యములోనికి వచ్చిన రామునికి సహాయము చేశారుకానీ, రామున్ని వారు దేవుడని నమ్మలేదు. అలా నమ్మేదానికి వారికి అవకాశమేలేదు. ఎందుకనగా! సూర్యుడు చెప్పిన దైవజ్ఞానమును, మనువుద్వారా తెలియబడిన జ్ఞానమును తమ పెద్దల ద్వారా తెలిసి సంపూర్ణ జ్ఞానులుగాయుంటూ, మూడు ఆత్మల జ్ఞానమును తెలిసిన ద్రావిడులుగా యుండుట వలన, వారు మనుషులను దేవునిగా నమ్మని ఆత్మజ్ఞానులని చెప్పవచ్చును. అటువంటి ద్రావిడులలో ముఖ్యమైన ఆత్మజ్ఞాని అయిన ఆంజనేయుడు తన అంతరాత్మను వదలి బయట మనిషిని దేవుడనుటకు అవకాశము లేదు. అటువంటి జ్ఞానిని ఆర్యులు అవమానించుటకు కాదా రాముని చెంత కాళ్ళవద్ద కూర్చోబెట్టినది?

ఈ విధముగా చెప్పుతూపోతే చెప్పేంత, విప్పుతూ పోతే విప్పేంత ఆర్యులు ద్రావిడుల మీద చేసిన మోసములు, కుట్రలు, కుతంత్రములు బయటపడుచూపోతూనే ఉంటాయి. వంగేవాడుంటే మీద కూర్చునే వాడుంటాడు అని సామెత చెప్పినట్లు, మోసపోయేవారుంటే మోసము

చేయువారు ఎక్కడైనా ఉంటారు. మోసపోను అని జాగ్రత్తగాయున్న వానిని ఎవరూ మోసము చేయలేరు. అజాగ్రత్తగా యున్నవానిని మోసము చేయుటకు ఎవరో ఎక్కడినుండో రావలసిన అవసరములేదు. ఇంట్లోవాళ్ళే అటువంటి వానిని మోసము చేయగలరు. అందువలన ద్రావిడులైనవారు ఇప్పటికైనా జాగ్రత్తపడి ఆర్యులతో మోసపోకుండా ఎరుకగా ఉండవలెనని తెలుపుచున్నాను.

**(ఈ విధముగా నేను చెప్పుచున్న మాటలను విని ఒక వ్యక్తి కొంతవరకు నాతో మాట్లాడి కొన్ని ప్రశ్నలు నన్ను అడిగాడు. ఈ విధముగా మా చర్చ సాగినది.)**

**ప్రశ్న :-మీరుచెప్పినవి మంచిమాటలుగానే ఉన్నవి గానీ, వాటిలో కొన్ని విషయముల మీద మీరు చెప్పినది మాకు అర్థము కాలేదు. మనదేశము భారతదేశము, భారతదేశములోయున్న వారందరమూ భారతీయులమే. ఇప్పుడున్నది అంతేకదా! ఇప్పటిది ఇప్పుడు చూచుకోకుండా ఎప్పటిదో చూచుకోవలసిన పనేముంది? ఎప్పుడో ఏ యుగములోనో యున్న ఆర్యుల తోనూ ద్రావిడులతోనూ మనకేమి పని? మన బ్రతుకు మనము చూచుకొంటే సరిపోదా? దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** అలా అందరూ మన బ్రతుకు మనము చూచుకొంటామంటే తప్పులేదు గానీ, మనము ఎందుకు పుట్టాము? ఎందుకు బ్రతుకుచున్నాము? ఎందుకు చస్తున్నాము? అని తెలియకపోతే మనిషికీ పశువుకు ఏమీ తేడా లేదని అంటాను. ఒక మనిషి నిజముగా మనిషిగా బ్రతకాలంటే తను ఎవరు? ఎక్కడినుండి వచ్చాను? ఎక్కడికి పోతాను? అను కనీస జ్ఞానమైనా ఉండవలెను. అట్లుకాక మనిషి జంతువుగా బ్రతుకుతానంటే వానికి ఏమీ

అవసరములేదు. నీమాట ప్రకారము ఎప్పుడోయున్న ద్రావిడులతో గానీ, ఆర్యులతోగానీ అవసరములేదు అనుకొందాము. ఇప్పుడు నీవు భారతీయుడవే అని అంటున్నావు. నీవు భారతీయుడుగా ఎప్పుడయ్యావో, ఎలా అయ్యావో అదైనా నీకు తెలిసియుండాలి కదా! మన బ్రతుకు మనము చూచుకొంటే సరిపోదా అనికూడా అన్నావు. బ్రతుకంటే సంపాదించుకొని తినేదేనా? అదే బ్రతుకైతే పశువులు కూడా అదే పనిని చేయుచున్నవి. ఏదో ఒకటి సంపాదించుకొని తిని బ్రతుకుచున్నవి. బ్రతుకంటే అంతేనా?

**ప్రశ్న :-మనిషి జంతువుగా కాకుండా ఒక మనిషిగా బ్రతకాలంటే ఏమి చేయాలి?**

**జవాబు :-** తనకంటే ముందు జరిగిపోయిన చరిత్రను చూడాలి. అందులో మంచిదేదో గ్రహించాలి. మంచి చరిత్రను ఆధారము చేసుకొని బ్రతికితే మనిషి మనిషివలె బ్రతకగలడు.

**ప్రశ్న :- జరిగిన చరిత్రలు అనేకములు గలవు. అందులో ఏది మంచి చరిత్రయో, ఏది చెడు చరిత్రయో ఎలా గుర్తించగలము?**

**జవాబు :-** ఎన్ని చరిత్రలున్నా అన్నీ మనిషి వలన ఏర్పడినా, కొన్ని మాత్రము దేవుని వలన ఏర్పడినవి ఉండును. మనుషుల చరిత్రలను వదిలి దేవుడు చెప్పిన చరిత్రను తెలియగలిగి బ్రతికితే అదే నిజమైన మానవజన్మ యగును. అట్లుకాకపోతే నేను మనిషినే అనుకొనినా వాడు జంతువుతో సమానమే యగునని జ్ఞాపకముంచుకో.

**ప్రశ్న :- ఇంతకుముందు ఆర్యులు ద్రావిడులు అని రెండు తరగతుల వారిని గురించి చెప్పారు. ఆ రెండు జాతులవారు మాది మంచి చరిత్రయని ఒకరంటే, మాది మంచి చరిత్ర అని ఇంకొకరు అంటున్నారు. ఎవరిది**

**మంచిదనుటకు మనుషులు చెప్పిన దానిని చూడవద్దు, దేవుడు చెప్పిన దానిని చూడమని మీరే చెప్పుచున్నారు. మనకు చరిత్రలో అంతా మనుషులే కనిపించుచున్నారు తప్ప దేవుడు ఎక్కడా కనిపించలేదు. అటువంటప్పుడు దేవుని చరిత్ర కొరకు ఎక్కడ వెదకాలి? ఏది దేవుని చరిత్రయని తెలియాలి. మీరు చెప్పగలరా?**

**జవాబు :-** ఆర్యులు ద్రావిడులు అను రెండు పేర్లు రెండు అర్థములతో కూడుకొనియున్నవి. ఆర్యులు అనగా గురువులు అని అర్థముకాగా, ద్రావిడ అంటే మూడు ఆత్మల జ్ఞానము తెలిసినవారనీ, క్షర, అక్షర, పురుషోత్తమ అను ఆత్మల వివరము తెలిసినవారనీ అర్థము. మొదట జ్ఞానమును తెలిసిన ప్రజలు వారు తెలిసిన జ్ఞానమునుబట్టి, వారు తెలిసిన జ్ఞానమునకు సమానమైన అర్థము నిచ్చు పేరును గుర్తుగా ఉండునట్లు "ద్రావిడ" అను శబ్ధముతో ద్రావిడులు అని చెప్పబడినారు. ద్రావిడులకు సంపూర్ణమైన అర్థము, నిజమైన భావము వారి పేరులోనే కలదు. ఎవడు శరీరములోని మూడు ఆత్మల జ్ఞానమును తెలియునో వానిని అర్థము ప్రకారము ద్రావిడ జాతి వాడని చెప్పవచ్చును. పూర్వము భారతదేశమంతా కృతయుగము చివరిలో మూడుకోట్ల ద్రావిడ మనుషులు ఉండేవారని చెప్పుకొన్నాము. త్రేతాయుగము మొదటిలో మధ్య ఆసియానుండి వచ్చిన ఆసీయులు ద్రావిడులను చూచి ఓర్వలేక, ఇతరుల కంటే తాము తక్కువగాయుండుటకు ఇష్టపడక, ఆత్మజ్ఞానులు అనిపించుకొంటున్న ద్రావిడులకంటే పెద్దగా ఉండదలచి, తమను "ఆర్యులుగా" చెప్పుకోవడము జరిగినది. ఆర్యుడు అను పదము ఆచార్యుడు అను పదము నుండి పుట్టినది. ఆచార్యుడు అనగా గురువు అని అర్థము రాగలదు. ఆచార్యుడులో రెండవ అక్షరము "చా" ను తీసివేసి ఆర్యుడు అనినా సరిపోవును. ప్రతి మనిషికీ గురువు

అవసరము అను మాటప్రకారము ప్రతి జ్ఞానికి కూడా గురువు అవసరమే. ద్రావిడులైన వారందరూ ఆత్మజ్ఞానులు కనుక, వారికి కూడా గురువు అవసరమే. దీనినిబట్టి జ్ఞానికంటే గురువు అధికుడనీ, గురువులేని వాడు జ్ఞాని కాలేడనీ వివరము కలదు. అందువలన ద్రావిడులకంటే (జ్ఞానులకంటే) గొప్ప స్థానమైన గురువులుగా తమను తాము తెలుపుచూ మధ్య ఆసియా నుండి వచ్చిన వారు తమను ఆర్యులుగా ప్రకటించుకోవడము జరిగినది.

ద్రావిడులు జ్ఞానులు అయినందున వారిని ఇందువులు అని అంటున్నాము. ఇందువు అనగా జ్ఞాని అర్థము. ఆ అర్థము ప్రకారము ద్రావిడులందరినీ ఇందువులని అనుచున్నాము. అయితే ఆర్యులను ఇందువులు అని అనుటకు వీలులేదు. ఎందుకనగా వారు ఇందువులైన జ్ఞానులకంటే గొప్పవారైన గురువులు అను అర్థముతో యున్నారు కనుక వారిని ఆర్యులు అనే అనాలి, ఇందువులు అని అనకూడదు. ఇందువు అనుపేరు అర్థము ప్రకారము ఆర్యులకు సరిపోదు. ఆచార్యుడు లేక ఆర్యుడు అను పదము ఇందువు కంటే గొప్పదని ఎవరైనా ఒప్పుకోక తప్పదు. అయితే ఇందువులకు ఆర్యుల కంటే ముందే సూర్యుడు ఆదిగురువని పేరుగాంచియున్నాడు. మొదటి జ్ఞానమును తెలిపినవాడు గురువు అను సూత్రము ప్రకారము అప్పటి ఇందువులైన ద్రావిడులకందరికీ సూర్యుడే గురువు అగును. అందువలన మధ్యలో వచ్చి మేము గురువులము అని చెప్పినా వారు పేరుకు గురువులేగానీ, వాస్తవముగా గురువులుగా లెక్కించబడరు. ఇందువులకు ఆ దినము తెలిసిన మూడు ఆత్మల జ్ఞానము ఏమాత్రము ఆర్యులకు తెలియదు. జ్ఞానమే తెలియనివాడు ఇందువే కాలేడు కదా! ఇందువుకు గురువెట్లగును అను ప్రశ్న రాగలదు. అందువలన ఆర్యులు గురువులమను అర్థముతో చెప్పుకొనినా, వాస్తవానికి వారు పేరుకు

మాత్రము గురువులేగానీ, జ్ఞానమునకు గురువులుకాదని తెలియుచున్నది. మనము దేవునికి సంబంధించిన జ్ఞానచరిత్రను తెలియుటకు జ్ఞానమును చూడాలి గానీ, గురువునుకాదు. అందువలన ఇందువులైన ద్రావిడుల జ్ఞాన విషయమును ఆధారము చేసుకొని చూస్తే, అసలైన దైవజ్ఞానము తెలియును. ఎప్పుడయితే దైవజ్ఞానము మనిషి తెలియగలడో అప్పుడే వాని జీవితము సార్థకమగును, మనిషిగా పుట్టినందుకు మనిషిగా బ్రతుకగలడు. జ్ఞానము లేని జీవితము వాసనలేని పూవులాంటింది. అందువలన మనిషి జీవితమునకు అర్థము చేకూరాలంటే, మనిషి ఇందువుగా (జ్ఞానిగా) మారి ఆత్మజ్ఞానమును తెలియవలసిందే.

**ప్రశ్న :- ఆర్యులైన వారికి ఆత్మజ్ఞానమే తెలియనప్పుడు ఏ విషయములో గురువులమని పేరు పెట్టుకోవలసి వచ్చినది? మీరు దేనికి గురువులని వారిని ప్రశ్నించితే ఏమని సమాధానము చెప్పగలరు?**

**జవాబు :-** ఆర్యులు చాలా తెలివైనవారని ముందే చెప్పాము. ఒక్క దైవ జ్ఞానమందు తప్ప మిగతా అన్ని విషయములలో వారిని మించిన వారే లేరని చెప్పవచ్చును. ఎన్నో విషయములలో పండితులైనవారు, తాము ఇటువంటి ప్రశ్నలకు చిక్కుబడకుండా, ముందే వేదములను, ఉపనిషత్తులను, పురాణములను సృష్టించి అవియే నిజమైన జ్ఞానమని ప్రచారము చేసుకొన్నారు. బయటి ఆదాయము, బయటి ఫలితములు మనిషికి వేద కార్యములవలన వచ్చుననీ, వేదములలో చెప్పబడిన యజ్ఞములను, తపస్సులను చేయుట చేత జీవితములో గొప్ప లాభములు, గొప్ప ఫలితములు సాధించవచ్చుననీ ప్రచారము చేశారు. ఎవరికీ తెలియని వేదములను, యజ్ఞములను, తపస్సులను సృష్టించిన ఆర్యులు ఆ విషయములలో గురువులుగా తమ పేరును సార్థకము చేసుకొన్నారు. అంతేతప్ప దైవ

జ్ఞానములోగానీ, దైవజ్ఞానమైన మూడు ఆత్మల విషయములోగానీ ఏమీ తెలియనివారేననీ, దైవజ్ఞానములో వారు ఎవరికీ గురువులు కాదనీ చెప్పవచ్చును. తాము వేదములకు, యజ్ఞములకు, తపస్సులకు గురువుల మనియే ప్రకటించుకొనుచూ, వేద, యజ్ఞ, తపస్సులే నిజమైన జ్ఞానమనీ, వేదములు చదవకుండా, యజ్ఞములు చేయకుండా, తపస్సులు ఆచరించ కుండా ఎవరూ జ్ఞానికాలేరని ప్రచారము చేయుచూ, ఆ విషయములలో తామే గురువులమని చెప్పుకొంటున్నారు.

**ప్రశ్న :- ఆర్యులు చెప్పుచున్న వేద, యజ్ఞ, తపస్సుల వలన దైవము తెలియదా? వారు చెప్పినది ఏదీ దైవజ్ఞానము కాదా?**

**జవాబు :-** దేనినైనా కాదు అని చెప్పుటకుగానీ, ఔను అని చెప్పుటకుగానీ, శాస్త్రము ఆధారముండవలెను. శాస్త్రము అనగా నిర్ధారణ చేయబడిన చట్టములాంటిది. ఇది ఇట్లే ఉంటుందని శాసించి చెప్పు దానిని శాస్త్రము అంటాము. ప్రపంచములోని సమస్త విషయములకు సంబంధించినవి ఆరు శాస్త్రములు కలవు. ఆ ఆరు శాస్త్రముల వరుస క్రమము తెలియాలంటే ముందుగా మంత్రములాంటి దానిని జ్ఞప్తిలో పెట్టుకోవలెను. ఆరు అక్షరముల మంత్రమే ఆరు శాస్త్రములకు సూచన అని తెలియవలెను. "గ.ఖ.ర.భౌ.జ్యో.బ్ర" అను ఆరు అక్షరముల శబ్ధములో మొదటిది 'గ' అను అక్షరముతో గణితశాస్త్రమును, 'ఖ' అను శబ్ధముతో ఖగోళశాస్త్రమును, 'ర' అను శబ్ధముతో రసాయన శాస్త్రమును, 'భౌ' అను శబ్ధముతో భౌతిక శాస్త్రమును, 'జ్యో' అను శబ్ధముతో జ్యోతిష్య శాస్త్రమును చెప్పవచ్చును. చివరిలో నున్న అక్షరము 'బ' మరియు 'ర' అను రెండక్షరముల సంయుక్త అక్షరము. అందువలన దానిని 'బ్ర' అని అంటున్నాము. 'బ్ర' అను శబ్ధము బ్రహ్మవిద్యాశాస్త్రమును సూచించుచున్నది. "గ ఖ ర భౌ జ్యో బ్ర" అను

మంత్రములోని అక్షరముల వరుస క్రమమును బట్టి ఆరు శాస్త్రములను సులభముగా చెప్పవచ్చును. ఆర్యులు తాము చెప్పునది దైవజ్ఞానమని చెప్పునప్పుడు ఆ మాట వాస్తవమా కాదా! అని చూచుటకు శాస్త్రమును ఆధారము చేసుకొని చూడవలసి యున్నది.

ఆర్యులు తాము చెప్పునది నిజమైన దైవజ్ఞానమని చెప్పినప్పుడు దైవజ్ఞానమునకు సంబంధించిన శాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము వారిమాట సత్యమా, అసత్యమా అని చూడవలసియున్నది. ప్రస్తుత కాలములో బ్రహ్మవిద్యాశాస్త్రము మూడు గ్రంథములలో మాత్రము కనిపించు చున్నది. బ్రహ్మవిద్యా శాస్త్రమును స్వయముగా దేవుడే చెప్పగా (చెప్పించగా) మిగతా ఐదు శాస్త్రములను మనుషులు చెప్పారు. దేవునికి సంబంధించిన విషయములను లేక ధర్మములను దేవుడు తప్ప ఇతరులు చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా! దేవుని ధర్మములు దేవునికి తప్ప ఇతర మానవులకు ఎవరికీ తెలియవు. అందువలన దైవశాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రమును దేవుడే చెప్పాడని చెప్పాలి. దేవుడు భగవంతునిగా మార్పు చెంది వచ్చి చెప్పినవి భూమిమీద రెండు గ్రంథములు గలవు. వాటిలో మొదటిది భగవద్గీత. భగవద్గీత ఐదువేల సంవత్సరముల పూర్వము గ్రంథముగా బయలుదేరి వచ్చినది. రెండవది బైబిలు. బైబిలు రెండువేల సంవత్సరముల పూర్వము గ్రంథరూపముగా బయటికి వచ్చినది. దేవుడు భగవంతునిగా చెప్పకపోయినా, ఆదియందు దేవుడు చెప్పిన జ్ఞానమును విని తెలుసుకొన్న సూర్యగ్రహమువలె, జిబ్రయేల్ అను గ్రహము ఆదిలో వాణి ద్వారా వచ్చిన దేవుని జ్ఞానమును తెలుసుకొని, అదే జ్ఞానమునే భూమిమీద ప్రవక్తకు చెప్పగా, ప్రవక్త దానిని ఖుర్‌ఆన్ గ్రంథముగా బయటికి తీశారు. అందువలన ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలోనూ, ద్వితీయ దైవ గ్రంథమైన

బైబిలులోనూ, అంతిమ దైవ గ్రంథమైన ఖుర్‌ఆన్ గ్రంథములోనూ దేవుని విషయములు శాస్త్రబద్ధముగాయున్నవి. దీనినిబట్టి ఈ మూడు గ్రంథములను బ్రహ్మవిద్యా శాస్త్ర గ్రంథములుగా చెప్పవచ్చును.

ఇప్పుడు అసలు విషయానికి వచ్చి ఆర్యులు చెప్పిన వేదములు, యజ్ఞములు, తపస్సులు దైవజ్ఞానమునకు సంబంధించిన విషయములాయని చూచుటకు బ్రహ్మవిద్యకు సంబంధించిన భగవద్గీతను చూస్తే అందులో యజ్ఞములుగానీ, వేదాధ్యయనములుగానీ, తపస్సులు చేయడముగానీ, దేవునికి సంబంధించిన విషయములుకావు అని తెలియుచున్నది. భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమను అధ్యాయమందు 48వ శ్లోకమున మరియు 53వ శ్లోకమున ఈ విధముగా కలవు.

*48వ శ్లో॥ నవేద యజ్ఞాధ్యయనైర్న దానైర్న చక్రియాభిర్న తపోభిరుగ్రైః ।*
*ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర॥*

*53వ శ్లో॥ నాహం వేదైర్న తపసా నదానేన న చేజ్యయా ।*
*శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥*

**భావము :- "అర్జునా! భూమిమీద నీవు తప్ప ఇంతవరకు ఎవరూ ఈ దృశ్యమును చూచినవారు లేరు. ఇది యజ్ఞములవలనగానీ, వేదముల వలనగానీ, దానముల వలనగానీ, ఉగ్రమైన తపస్సుల వలనగానీ ఎవరికీ సాధ్యపడలేదు."**

"తపముల వలనగానీ, దానముల చేతగానీ, యజ్ఞముల వలనగానీ, వేదముల అధ్యయనముల వలనగానీ, ఇప్పుడు నీవు చూచిన ఈ విశ్వ రూపమును చూచుటకు శక్యము కాదు."

బ్రహ్మవిద్యా శాస్త్రమైన భగవద్గీతలో ఆర్యులు బోధించిన యజ్ఞ, దాన, వేద, తపస్సుల వలన దేవుడు తెలియబడడని స్పష్టముగా ఉండుట వలన, ఆర్యులు చెప్పినది దైవజ్ఞానము కాదని సులభముగా తెలిసి పోవుచున్నది. అంతేకాకుండా భగవద్గీతా గ్రంథములోనే సాంఖ్యయోగము అను అధ్యాయములో 45వ శ్లోకమందు మరియు విజ్ఞానయోగమను అధ్యాయమందు 14వ శ్లోకములోనూ వేదములను గురించి ఈ విధముగా చెప్పడమైనది.

*45వ శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున !*

*14వ శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।*
*మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే ॥*

**భావము :- "అర్జునా! వేదములయందు తామస, రాజస, సాత్త్వికమను మూడు గుణ విషయములే ఉన్నవి వాటిని వదులుకో"**

"దేవుడనైన నేను నా మాయను గుణముల రూపములో తయారు చేసియుంచాను. నేను తయారు చేసిన మాయను దాటుటకు ఎవరికీ సాధ్యము కాదు. ఎవడైతే నన్ను తెలిసి ఆరాధించగలడో వాడు మాత్రము మాయను దాటి రాగలడు."

ఈ రెండు శ్లోకములలోనూ వేదములను మాయ అను మారు పేరుతో పిలువడము జరిగినది. దేవున్ని తెలియుటకు మాయ ఎప్పటికీ ఆటంకముగా యుండును. ఎవనినీ మాయ దేవునివైపు పోనివ్వదు. దేవుని చుట్టూ కవచమువలెనున్న మాయ గుణముల చేత తయారు చేయబడినదై యున్నది. మాయ రూపములోనున్న గుణముల విషయములే వేదముల యందున్నవి. అందువలన వేదములలో గుణములతో కూడుకొన్న ప్రపంచ

విషయములున్నవని చెప్పవచ్చునుగానీ, జ్ఞానముతో కూడుకొన్న దైవ విషయములు ఉన్నవని చెప్పుటకు వీలులేదు. ఆర్యులు తాము చెప్పిన వేద, యజ్ఞములు జ్ఞానమని ప్రచారము చేసినా, బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఆర్యుల మాట అసత్యమని తెలిసిపోవుచున్నది. ఆర్యులు చెప్పినది ఏదీ దైవజ్ఞానము కాదనీ, వారు చెప్పినవి సాధారణముగానున్న ప్రపంచ విషయములేననీ చెప్పవచ్చును.

**ప్రశ్న :- తమది దైవజ్ఞానము కానప్పుడు ఆర్యులు ఎందుకు యజ్ఞ, వేద, తపస్సులను జ్ఞానముగా పోల్చి చెప్పవలసి వచ్చినది?**

**జవాబు :-** ఆర్యులు ఇందూదేశములోనికి ప్రవేశించకముందే సంస్కృత భాషలో పాండిత్యము కల్గి, అదే భాషలో వేదములను పాటల రూపముగా అభ్యాసము చేసుకొని ఇంపుగా పాడుకొనెడివారు. సంస్కృత భాషకు లిపి లేకున్నా పలుకుటకు అందమైన భాషగాయుండుట వలన, తమ భాషను మించినది లేదు అనికూడా చెప్పుకొనెడివారు. అట్లు ముందే సంస్కృతము నకు, ఋగ్వేదమునకు అలవాటుపడిన ఆర్యులు ఇందూదేశములోనికి వచ్చిన తర్వాత తెలుగు భాషను, తెలుగు భాషలోని పద్యముల అందమును చూచి ఓర్వలేకపోయారు. అదే అసూయతో ఇందువులలోని జ్ఞానమును చూచికూడా అసూయచెందినవారై, హిందీ లిపిని తయారుచేసి దానికే దేవనాగరలిపియని పేరుపెట్టి, దానితో సంస్కృతమును వ్రాయగలిగి మిగతా మూడు వేదములను, ఉపనిషత్తులను ఇందువుల జ్ఞానమునకు పోటీగా తయారుచేసి, అదే జ్ఞానమని చెప్పడము మొదలుపెట్టారు. సామవేదములో మంత్రములను వ్రాసి, వాటి మహిమ వలన కొన్ని పనులు నెరవేరునట్లు చూపడము వలన, చాలామంది సామాన్యులు వేదముల వెంటపడడము జరిగినది. ఇందువుల మీద పై చేయిగా ఉండవలెనను ఉద్దేశ్యముతోనే

వేదములను గొప్పగా చెప్పుకోవడము జరిగినది. అంతేకాక వేదమంత్రము లతో అనుసంధానము చేసి యజ్ఞములను అనేకముగా సృష్ఠించి, ఒక్కొక్క రక యజ్ఞమునకు ఒక్కొక్క రకమైన ఫలితముండునని చెప్పారు. మానవులలో ఆశ అను గుణము పెద్దది, మొదటిది అని తెలిసి ఆశ అను గాలమును యజ్ఞములను పేరుతో ప్రజలలో వేసి, తమవైపు కొందరిని లాగుకొనుటకు ప్రయత్నించారు. వారి ప్రయత్నము సఫలమై తమవైపూ, తమ వేద, యజ్ఞ, దాన, తపస్సుల వైపూ ప్రజలు ఆశతో రావడమును చూచి, శాస్త్రవిరుద్ధమైన వైనప్పటికీ వాటినే నిజమైన జ్ఞానమని చెప్పి ప్రజలను మభ్యపెట్టడము జరిగినది. ముందే వారి సంఖ్య ఆరుకోట్లు, ద్రావిడుల సంఖ్య మూడుకోట్లు, ఆర్యుల సంఖ్యా బలము ఎక్కువగా ఉండుట వలన, క్రొత్తగా మాయవశు లైన ద్రావిడులు కూడా వారివద్ద చేరి వేదములను, యజ్ఞములను ఆశ్రయించుట వలన, ఇదే మంచిదని అధర్మములైన వాటినే వారు ధర్మములని ప్రచారము చేశారు. వారి ముఖ్య ఉద్దేశ్యము ద్రావిడుల మీద పెత్తనము చెలాయించడమే అయినందున, ద్రావిడులకంటే ఆర్యులు పెద్దగా కనిపించుటకు తమకు అలవాటయిన, తమకు బాగా తెలిసిన యజ్ఞ, వేద, దాన, తపస్సులనే నిజమైన జ్ఞాన మార్గములని చెప్పుచూ వచ్చారు. ద్రావిడుల జ్ఞానము ధర్మములతో కూడుకొనియున్నదనీ, తమ కార్యములు అధర్మములని తెలిసినా, ద్రావిడుల మీద పెత్తనము చెలాయించుటకు, ద్రావిడులకంటే పెద్దగా కనిపించుటకు, ఆర్యులు అదే పనిగా యజ్ఞ, వేద, దాన, తపస్సులను ప్రచారము చేశారు.

**ప్రశ్న :- మీరు చెప్పునది త్రేతాయుగములో జరిగిపోయినది కదా! ఇప్పుడు నేను పెద్ద నీవు చిన్న అను భావములు లేవు కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ఇప్పుడు లేవని ఎవరు చెప్పారు? అప్పుడు ఆర్యులు నాటిన

బీజములు ఇప్పుడు మహా వృక్షములై కూర్చున్నవి. అప్పటినుండి ఇప్పటి వరకూ పెరుగుచూనే వస్తున్నవి. ఎవరి సహాయము లేకుండానే మంచి తరిగిపోయి, చెడు పెరిగిపోగలదు అను పెద్దలమాట ప్రకారము, ఎవరి ప్రమేయమూ లేకుండానే క్రమేపీ జ్ఞానము తరిగిపోయి, అజ్ఞానము పెరిగి పోయినదని చెప్పవచ్చును. పూర్వము కృతయుగములో సంపూర్ణ జ్ఞానులైన ద్రావిడులు "ఇందువులు" అను పేరుతో ఈ దేశములో ఉండేవారని చెప్పుకొన్నాము. అటువంటి వారు ప్రపంచములో ఏ దేశములో లేరను ఉద్దేశ్యముతోనే, మన దేశమును ఆనాడు ఇందూదేశమని ప్రపంచ దేశము లన్నియూ చెప్పాయి. అయితే అంత పెద్ద ఘన చరిత్రయున్న ద్రావిడ జ్ఞాన ప్రజలు (ద్రావిడ జాతి ప్రజలు) శరీరములోని గుణ ప్రభావముల వలన, దేశములో వచ్చి చేరిన ఆర్యుల బోధల వలన, ద్రావిడులలోని జ్ఞానము త్రేతాయుగము నుండి మాయమవుతూ వచ్చినది. త్రేతా యుగములో రావణబ్రహ్మ సజీవముగాయున్నప్పుడు, దక్షిణ దేశమున కొంత జ్ఞానము మిగిలి యుండేది. రావణబ్రహ్మ పోయిన తర్వాత దక్షిణ భారతదేశమున కూడా ఆర్యుల ప్రభావము పెరిగి ద్రావిడ జ్ఞానము లేకుండా పోయినది. దానితో ద్రావిడ అను శబ్దముగానీ, దాని అర్థముగానీ చాలామందికి తెలియకుండా పోయినది. మొదట భారతదేశమంతాయున్న ఇందువులనబడు ద్రావిడులు, క్రమేపీ కొంతకాలమునకు దక్షిణ దేశమునకు మాత్రము పరిమితిగా మారిపోయారు. ప్రస్తుత కాలములో తమిళనాడులో తప్ప దేశములో మేము ద్రావిడులమని చెప్పుకొనువారు లేకుండాపోయారు. ఎప్పుడైతే దేవుని జ్ఞానము ప్రజలలో అడుగంటి పోయినదో, అప్పుడు మేము ద్రావిడులమను స్పృహను కూడా ప్రజలు కోల్పోవడము జరిగినది.

ఆర్యుల విషయానికివస్తే వారిది దైవజ్ఞానము కాకపోవుట వలన, ప్రపంచ జ్ఞానమే అయినందున, అది అభివృద్ధి చెందదము తప్ప క్షీణించడము అంటూ ఉండదు. అందువలన ఆర్యుల విషయములు వృద్ధి చెందుతూ వచ్చినవనియే చెప్పవచ్చును. ఆర్యులు ఒకరిక్రింద ఉండుటకు ఇష్టపడని వారైనందునా, వారు ద్రావిడులకంటే తెలివైనవారైనందునా, సంస్కృత భాషలో పాండిత్యమున్న వారందరూ పండితులమని చెప్పుచూ, ఒకవైపు తమను భూలోక దేవతలుగా (భూసురులుగా) చెప్పుకోవడము జరిగినది. పండిట్‌లని కొందరూ, పురహితులు (పురోహితులు) అని కొందరూ, ద్విజులు అని కొందరూ, పూజార్లని కొందరూ, ఋత్విక్కులని (యజ్ఞములు చేయువారని) కొందరూ, వేద గురువులని కొందరూ, గురువులని కొందరూ అనేక పేర్లతో ఆర్యులు సమాజములో కలిసిపోయారు. నేడు వారు ఏ వృత్తిలో యున్నా మేము బ్రాహ్మణులమని చెప్పుకొంటున్నారు. వాస్తవానికి వారు బ్రాహ్మణులు కాదు. నిజమైన బ్రాహ్మణులు ద్రావిడులే అయినా, వారు లేకుండా పోవడముతో ఆర్యులు బ్రాహ్మణులుగా చలామణి కావడము జరిగినది.

వాస్తవానికి బ్రహ్మజ్ఞానము కలవారిని బ్రాహ్మణులు అనాలి. అయితే బ్రహ్మ జ్ఞానము కలవాడు ఎక్కడున్నాడో తెలియదుగానీ, బ్రహ్మజ్ఞానము ఏమాత్రము లేని ఆర్యులు సమాజములో బ్రాహ్మణులుగా చలామణి అగు చున్నారు. ఎక్కడైనా ద్రావిడ బ్రాహ్మణుడు కనిపిస్తే అతనిని గురించి ఆర్య బ్రాహ్మణులు హేళనగా మాట్లాడడము జరుగుచున్నది. ద్రావిడులు దక్షిణ దేశమున ప్రస్తుత కాలములోయున్నారు. అయితే దక్షిణ దేశమునకు దగ్గరగాయున్న సముద్ర వాతావరణము చేత చాలామంది నల్లనిఛాయ కల్గియున్నారు. పూర్వము దక్షిణ ప్రాంతములో ద్రావిడ బ్రాహ్మణులు

అందరూ నల్లగనే ఉండేవారు. ఆర్యులు ఉత్తర దేశమున సముద్రమునకు దూరముగా ఉండుట వలన, మంచు పర్వతముల గాలులకు దగ్గరగా యుండుటవలన వారు అందరూ తెల్లగా యుండడము జరిగినది. ఆ విధముగా ఎవరైనా ద్రావిడ బ్రాహ్మణుడు నల్లగాయున్నట్లు కనిపిస్తే, ఆర్యులు నల్లని బ్రాహ్మణున్ని నమ్మకూడదు తెల్లని మాదిగను ముట్టకూడదు అనెడివారు. ఆ విధముగా నల్లగాయుండు ద్రావిడులను హేళనగా మాట్లాడుచుండెడివారు. బ్రాహ్మణుడే నల్లగుంటే మాదిగువ వారు తెల్లగుండరను భావముతో అలా అన్నారని తెలియుచున్నది. ఏది ఏమైనా ఆర్యులు తాము బ్రాహ్మణులు కాదని తెలిసీ, తమను ఆర్య బ్రాహ్మణులుగా ప్రకటించుకోవడము జరిగినది.

బ్రహ్మజ్ఞానమును బట్టి ఏ మనిషి అయినా బ్రాహ్మణుడు అని పిలువ బడుతాడుగానీ, కులములలో బ్రాహ్మణ కులము అనునది లేనే లేదు. అలాగే మాదిగువ వాడు అనే పదము జ్ఞానములేని వాని ఎడల చెప్పేదేగానీ, మా దిగువ అనునది కూడా ఒక కులము కాదు. చేసే పనులనుబట్టి కులములుగా సమాజమును కొందరు విభజించారుగానీ, జ్ఞానమునుబట్టి కులములను చెప్పుటకు వీలులేదు. జ్ఞానమును బట్టి చెప్పునవి మాదిగ, బ్రాహ్మణ అను పేర్లుండినా అవి జ్ఞానమున్న దానికి, జ్ఞానము లేనిదానికి గుర్తుగా యున్నాయి తప్ప కులములు కాదని తెలియవలెను. ఈ విషయమును కొంతముందు కూడా చెప్పుకొన్నాము. అయితే ఈ దినములలో ఆర్య బ్రాహ్మణులను వారు, తమను తాము బ్రాహ్మణులుగా చెప్పుకోవడము జరుగుచున్నది. అలాగే ద్రావిడ బ్రాహ్మణులుగా చెప్పుకొనువారు అరుదుగా కొందరు మాత్రము యున్నారు. క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురు పురుషుల (ఆత్మల) జ్ఞానమును తెలిసినవారు ఎవరైనా ఉంటే, వారిని ద్రావిడ

బ్రాహ్మణులు అని చెప్పవచ్చును. అలాగే వేదముల, యజ్ఞముల జ్ఞానము తెలిసినవారెవరైనా ఉంటే వారిని ఆర్య బ్రాహ్మణులని చెప్పవచ్చును.

త్రేతాయుగములో ఆర్యులు ద్రావిడులను అణచివేసి, తాము ద్రావిడులకంటే ముందుండాలి, వారికంటే గొప్ప అని అనిపించుకోవాలనుకొని, అప్పటినుండీ ప్రణాళికాబద్ధముగా ద్రావిడులను అణచివేస్తూ, వేరెవరూ తమకంటే ముందుకు పోకుండా, తమకంటే ఎక్కువ పేరు ప్రఖ్యాతులు పొందకుండా చేయుచూ వస్తున్నారు. కాలక్రమమున ద్రావిడులు తమను తాము మరచిపోయినా, ఆర్యులు మాత్రము తమను తాము మరిచి పోకుండా తమ ధ్యేయమును పెద్దల కాలమునుండి, త్రేతాయుగము నుండి సాధించుచునే వస్తున్నారు. త్రేతాయుగములోనూ, ద్వాపరయుగములోనూ భారతదేశమంతా ఆర్యులు, ద్రావిడులు తప్ప ఇతరులు ఎవరూ లేరు. ఇతర మతములు కలియుగము వరకూ ఏవీ లేవు. అందువలన ఆర్యులు సులభముగా ద్రావిడుల మీద దృష్టిపెట్టి, వారిని ఏమి చేయాలనుకొన్నారో అదియే చేశారు. ద్రావిడులను లేకుండా చేసి ఆర్య సమాజమును వృద్ధి చేయాలనుకొన్నారు. ఆ విధముగానే చేశారు. త్రేతాయుగములోనూ, ద్వాపర యుగములోనూ ఆర్యులు నిరాటంకముగా తమ కార్యములను చేయుచూ వచ్చారు. ఫలితముగా భారతదేశమంతా నేడు ఆర్య సంస్కృతి నిండిపోయినది. ద్రావిడ సంస్కృతి మచ్చుకైనా మిగలలేదు. దక్షిణ భారత దేశమున 'ద్రావిడ' అను శబ్ధము ఉంటే ఉండవచ్చునుగానీ, పూర్వమున్న కృతయుగములోని జ్ఞానము ద్రావిడులలో లేకుండా పోయినది. అందువలన దక్షిణ దేశమున ఎక్కడైనా సాక్ష్యమునకు మేము ద్రావిడులమని చెప్పుకొనినా, వారిలో ద్రావిడ జ్ఞానముగానీ, ద్రావిడ భావములు గానీ ఏమీ లేకుండా పోయినవి. ఆ విధముగా ద్రావిడులు తమ జ్ఞానము కోల్పోయి, తమ

చరిత్రను మరిచిపోయి, 'ఆర్యులకు జై' అంటూ ఆర్యులను అనుసరించుటకు, ఉద్దేశ్యపూర్వకముగా ద్రావిడులను మార్చిన ఆర్యులే కారణమని తెలియు చున్నది.

ఆర్యులు మొదటినుండి ద్రావిడులను అణచివేయుటకు ఆచరించిన కొన్ని పనులను సాక్ష్యము కొరకు వివరిస్తాము చూడండి. మొదట ఆర్యులు ఇందూదేశములో ప్రవేశించిన తర్వాత, ఈ దేశములోని ద్రావిడ జ్ఞానులు జ్ఞానములో ఎంతో గొప్పవారనీ, జ్ఞానశక్తి సంపూర్ణముగా యున్నవారనీ తెలిసి, వారికంటే గొప్పవారు కావాలనుకొన్న ఆర్యులు, మొదట ద్రావిడులను వారి జ్ఞానమార్గమునుండి తప్పించి, తమ మార్గమును అనుసరించునట్లు చేయాలనుకొన్నారు. అప్పుడు ద్రావిడులవద్దయున్న జ్ఞానము వారి పేరుకు తగినట్లు మూడు ఆత్మల జ్ఞానము కలదని గ్రహించగలిగారు. మూడు ఆత్మల జ్ఞానముననుసరించి కాలమునకు కూడా నాలుగుపేర్లను కృత, త్రైతా, ద్వాపర, కలియుగములని పేరుపెట్టారని తెలిసి, ఈ నాలుగు పేర్లలో త్రైత అనగా మూడు అనియూ, ద్వాపర అనగా రెండుకానిది మూడవది అనియూ బయటికి కనిపించునట్లు అందరికీ తెలియునట్లు ఉండుట వలన, ఆ రెండు యుగముల పేర్లను ముందు మార్చాలనుకొన్నారు. ఆ విధముగా అనుకొనిన వెంటనే అప్పుడు తామున్న త్రైతాయుగము పేరును కొంతమార్చి 'తె' క్రింద ఐత్వము 'ై' ను తీసివేసి త్రేతా అను పేరు వచ్చునట్లు చేశారు. త్రేతా అనగా అర్థము లేదు. ఆ విధముగా 'త్రైత' (మూడు) అను పదమును 'త్రేతా' అను అర్థములేని పదముగా మార్చివేశారు. అంతేకాకుండా అప్పుడు యుగము అను పేరు యోగము అని ఉండెడిది. వాస్తవముగా ఆనాటి కాలము పేరు త్రైతాయోగము. త్రైతాయోగము అనగా మూడు ఆత్మలు కలిసి పోవడము అని అర్థము. ఎప్పుడు విడిగాయున్న మూడు ఆత్మలు

ఒక్కటిగా కలిసిపోతే, అప్పుడు మనిషి దేవునియందు ఐక్యమైపోగలడు. ఈ విధమైన ఎంతో పెద్ద అర్థమును తెలుపు శబ్ధముగాయున్న 'త్రైతాయోగము' అను దానిని ఆర్యులు తమ తెలివిని ఉపయోగించి త్రేతాయుగముగా మార్చివేశారు. అప్పటినుండి త్రైతాయోగము కాస్త మారిపోయి త్రేతాయుగమై పోయినది.

ఆర్యులు మొదట జ్ఞానభావముతో కూడుకొన్న యోగమును యుగముగా, మూడు ఆత్మల వివరమును తెలుపు త్రైత పదమును త్రేత పదముగా మార్చివేసి, త్రేతాయుగముగా అందరిచేత పలికించి మొదటనే విజయమును సాధించారు. ద్రావిడులకు ద్రావిడ జ్ఞానమునకు ఎంతో సన్నిహిత అర్థముతోయున్న త్రైతాయోగమును త్రేతాయుగముగా మార్చిన దానివలన, మిగతా యోగములను కూడా యుగములుగానే చెప్పు కొంటున్నాము. ఈ విధముగా యోగము అను శబ్ధమును ఆర్యులు మార్చారని కూడా ఎవరికీ తెలియకుండా చేశారు. ద్వాపర యోగము అనినా రెండుకాని మూడవ యోగము అని అర్థము. ద్వా అనగా రెండు అనియూ, పర అనగా రెండిటికంటే వేరుగాయున్నదనియూ అర్థము. ఇక్కడ వివరముగా చెప్పుకొంటే ద్వాపరయోగము అనగా జీవాత్మ, ఆత్మ అను రెండు ఆత్మలకంటే వేరుగాయున్న పరమాత్మలోనికి ఐక్యము కావడము అని తెలియుచున్నది. ఆ దినములలో ద్రావిడులలోనున్న ముఖ్యమైన జ్ఞానము అదియే అయినందున, దానిని కూడా మార్చవలెనని ఆర్యులు ప్రయత్నము చేయగా, ఆ ప్రయత్నము విఫలమైపోయినది. అయితే యోగము అను దానిని అన్నిచోట్లా యుగము అను పదముగా మార్చగలిగారుగానీ, ద్వాపర అను దానిని మార్చలేకపోయారు. మొదటి అక్షరమైన 'ద్వా' అను శబ్ధములోనున్న రెండు అను అర్థమును భంగము చేయునట్లు 'దా'

కులముల వారు ఇటు ప్రపంచమునకు, అటు దేవునికి మధ్య దూరములో ఉందురు. అటువంటి వారిని కొంత ప్రయత్నము చేసి మార్చవచ్చును. బ్రాహ్మణులు అంటరానివారని ప్రక్కన పెట్టిన శూద్రులలో మూడు రకముల మనుజులు కలరు. వారి కులమునుబట్టి సామాజిక జీవితమునుబట్టి మూడు రకములుగా విభజించవచ్చును. నేను శూద్రుడనే అయినా నా కులము జోలికి నేను పోను. వారు వారి సామాజిక జీవనములను బట్టి ప్రపంచమునకు దగ్గరగా, దేవునికి దూరముగాయున్నారు. వారిని మార్చే ప్రయత్నములో మనమే మారిపోగలమను అనుమానము వచ్చుట వలన వారి జోలికి మేము పోము. వారికి దేవుడు తీర్పు తీర్చిపెట్టాడు. ఆ తీర్పు ప్రకారము వీరికి, ఈ కులమువారికి జ్ఞానము తెలియాలంటే చాలా కష్టము అని నేను చెప్పుచుందును. నేను అదే కులమువాడినే అయినా నేను నిజముగా ద్రావిడ బ్రాహ్మణున్నేయని ధైర్యముగా చెప్పుచున్నాను.

**ప్రశ్న :- భారత దేశము పూర్వమువలె ఇందూదేశముగా ఉండవలెనంటే ఏమి చేయాలి?**

**జవాబు :-** ఆర్యసాంప్రదాయములు పోయి ద్రావిడ సాంప్రదాయములు మనుషులలో వస్తే, తప్పనిసరిగా భారతదేశము తిరిగి ఇందూదేశముగా మారగలదు. లేకపోతే నేడున్న హిందూదేశముగానే ఉండగలదు.

**ప్రశ్న :- చివరిగా ఒక ప్రశ్న అడుగుచున్నాను. సృష్ట్యాదిలో దేవుడు స్థాపించిన జ్ఞానము ప్రజలలోనికి చేరి, పూర్తి ద్రావిడ జ్ఞానము ప్రజలలోనికి వచ్చి, ప్రపంచ దేశములలో ఫలానా ఇందూదేశము గొప్పది అని ప్రపంచ ప్రజలు అను కాలమొస్తుందంటారా? లేక అది ఒక కలగా మిగిలిపోతుందా? దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** మీ ప్రశ్న మంచిదే గానీ, మాకు మీరడిగిన ప్రశ్నలో కొంత

లోపము కనిపిస్తున్నది. మీరు తిరిగి ఇందువులుగా మారగలరా? అని అడిగినది సంతోషమే, అయినా ప్రపంచ ప్రజల దృష్టిలో ఇందూదేశము గొప్పది అని పేరు రావాలని అనుకోవడము కొంత లోపమే అగును. ప్రపంచ ప్రజలందరూ అజ్ఞానులుగాయుంటే మేము మాత్రము జ్ఞానులుగా మారిపోయి, వారిచేత ఇందూదేశము వారు గొప్ప జ్ఞానులు అని అనిపించు కోవడము మంచిదికాదు. ప్రపంచ ప్రజలు కూడా మాతోపాటే అందరూ జ్ఞానులుగా మారితే మాకు సంతోషముగానీ, మేము మాత్రము మారడము మాకు సంతోషముకాదు. గత చరిత్రలో ఒక్క ఇందూదేశము వారు మాత్రము జ్ఞానులుగా యుండి, మిగతా దేశములవారు జ్ఞానులు కాకపోవడము వలన, మన జ్ఞానము వారికి ప్రాకలేదు గానీ, వారి అజ్ఞానము మనకు ప్రాకినది. దానివలన ఇందువులు నేడు వెదకినా లేకుండా పోయారు. తిరిగి అటువంటి పరిస్థితి భవిష్యత్తులో రాకుండుటకు, ప్రపంచములోని మనుషులందరూ జ్ఞానులుగా మారాలని మేము కోరుకొంటున్నాము. అందరూ జ్ఞానులుగా మారినప్పుడే భూమిమీద ఎటువంటి అజ్ఞానమూ లేకుండా పోతుంది.

**ప్రశ్న :- నేను అలా అడిగినందుకు క్షమించండి? నేను అడిగిన ప్రశ్న వలన మీలోని ఉన్నత భావము మాకు మరియు ప్రజలందరికీ తెలిసి పోయినది. మీరు అనుకొన్నట్లు మేము కూడా ప్రపంచ ప్రజలందరూ జ్ఞానులుగానే మారాలని ఆశించుచున్నాము. అలా ప్రపంచమంతయూ జ్ఞానముతో ప్రకాశించవలెనంటే, ప్రపంచ ప్రజలలో ఒకే జ్ఞానము రావాలంటే ఏ ప్రయత్నము చేయాలి? ఎవరు ప్రయత్నము చేయాలి?**

**జవాబు :-** ఇది అసలైన ప్రశ్న. ఈ ప్రశ్నకు సంతోషముగా జవాబును చెప్పగలను. నేడు భారతదేశములో ఆర్య, ద్రావిడ అను రెండు తెగల వారి గురించే కాకుండా ప్రపంచ దేశములలో ఎన్నో మతములుగా యున్న ప్రజలు కూడా ఒకే త్రాడు మీదికి వచ్చి, ఒకే జ్ఞానమును తెలుసుకొని, ఒకే

దేవున్ని ఆశ్రయించునట్లు చేయాలి. ఆ విధముగా చేయగలిగినప్పుడు ఒక భారతదేశమే కాకుండా, ప్రపంచ దేశములన్నియు మారిపోగలవు.

**ప్రశ్న :- ప్రపంచ దేశములలో ఒక్క మతమువారు ఒక దేవున్ని ప్రార్థించడము, వారి మతమునకు సంబంధించిన బోధలను వినడము, చదవడము తప్ప ఇతర దేవున్ని గానీ, ఇతర బోధలు గానీ వినడమూ, చదవడమూ లేదు. మాది తప్ప ప్రపంచములో ఎవరిదీ పెద్దకాదు. మాది మాకు పెద్దదే అయినందున, మేము ఇతరుల జ్ఞానమును వినము, చూడము అనువారు కూడా కలరు. అటువంటి మొండివారికి మీరు ఎట్లు అసలైన దైవజ్ఞానమును చెప్పగలరు. మీరు చెప్పినావారే వినరు కదా!**

**జవాబు :-** ఎద్దు ఎంత మొండిదైనా దానికి ఒక చక్కిలి గిలి యుండునను సూత్రము కలదు కదా! ఆ సూత్రమును అనుసరించి ముందుకు పోగలను. మొండి ఎద్దు కొట్టినా, తిట్టినా తొందరగా నడువక నిదానముగానే నడుస్తుండును. బండిని త్రోలువాడు ఎంత అరచినా, ఎన్ని దెబ్బలు కొట్టినా నాకు కాదులే అన్నట్లు కదలక, మెదలక తన ఇష్టప్రకారమే పోవుచుండును గానీ, కొద్దిగా కూడా తన నడకలో మార్పు తెచ్చుకోదు. అటువంటి మొండి ఎద్దులను రైతులు చూచియే ఉందురు. అటువంటి మొండి ఎద్దులో కూడా కదలిక వచ్చి పనిచేయునట్లు కొందరు చేయుచుందురు. అదెలాయనగా! ఎద్దు ఎంత మొద్దుదైనా దాని శరీరము మీద ఎక్కడో ఒకచోట చక్కిలిగిలి తప్పని సరిగా యుండును. అది ఎక్కడుందో ముందే ఎద్దును త్రాకి చూచుకొన్న రైతు, దీనికి బీగము (తాళము) ఇక్కడుందిలే అని అనుకొని అవసరమొచ్చినప్పుడు అక్కడ చేయి పెట్టితే, ఎద్దు దానంతట అది చురుకుగా కదిలిపోవును. రైతు అక్కడనుండి చేయి తీసివేయుటకు మొండి ఎద్దు కూడా కదలును. చక్కిలిగిలి అనునది పశువులకే గాదు మనుషులకు కూడా ఉండునని అందరికీ తెలుసు. మనుషులకు భుజము క్రింద చంకలో

గానీ, మెడక్రింద గానీ, అరికాలులోగానీ, కడుపుమీద గానీ, వీపుమీద గానీ అనేకచోట్ల చక్కిలిగిలి ఉండును. పశువులకుగానీ, బండినిలాగు ఎద్దులకుగానీ అలాగే అనేక జాగాలలో చక్కిలిగిలి వుండును. చర్మము క్రింద నరాలకూడలి స్పర్శకు దూరముగా ఉండును. ఏదైనా స్పర్శ తగిలిన వెంటనే అక్కడ పుట్టిన చురుకుతనము శరీరమంతా ప్రాకి మనిషి గానీ, జంతువుగానీ హుషారుగా మారిపోవును. అందువలన మా బోధలకు మేము కదలము అను మొండివారికి చక్కిలిగిలి సూత్రమును అనుసరించి వారిలో మార్పువచ్చేటట్లు చేసి, చివరకు వారికి కూడా దైవజ్ఞానమును తెలియునట్లు చేయుదుము.

**ప్రశ్న :- ఆర్య సమాజములు నేడు చురుకుగా పని చేయుచూ యజ్ఞములను ఎలా చేయాలి, వేదములను ఎలా చదవాలి అని నేర్పించుచున్నారు. అంతేకాకుండా తిరుమల తిరుపతి దేవస్థానముల వారు కొంతడబ్బును కేటాయించి, ఆ డబ్బును ఖర్చుచేయుటకు అనేక ఆర్య సంస్కృతి కార్యములను చేయుచున్నారు. వేదపాఠశాలలను పెట్టి సంస్కృతమును నేర్పుచూ, వేదములలో డిగ్రీలను ఇచ్చుచున్నారు. ముఖ్యమైన దేవాలయములలో ఆర్య సాంప్రదాయమైన వేదములను చదవకుండా పూజలు జరుగడము లేదు. అలాగే యజ్ఞములు చేయకుండా అర్పణములు జరుగడము లేదు. గుడిలోని దేవునికి ఏమి చెప్పినా సంస్కృతములోనే చెప్పాలి అను నియమము గలదు. సంస్కృతము లేనిది గుడిలో పూజారి కూడా పూజ చేయలేదు. అటువంటి పరిస్థితి దేవాలయములవద్ద ఏర్పడినది. ఈ విధముగా ఎక్కడ చూచినా ఆర్య సంస్కృతి అల్లుకొనియుండగా, దానిని కాదని మీరు ద్రావిడ సంస్కృతిని ఎలా బయటికి తేగలరు?**

**జవాబు :-** ఈ మధ్యకాలములో క్రీ॥శ॥ 1881లో దక్షిణ గుజరాత్‌లో బ్రాహ్మణ కులమున జన్మించిన దయానంద సరస్వతి 1931వ సంవత్సరము

లో ఆర్యసమాజములను స్థాపించి యజ్ఞములను చేయుటకు, వేదములను చదువుటకు తర్ఫీదును పొందునట్లు చేయడమే కాకుండా, ప్రస్తుత కాలములో ఆర్య సాంప్రదాయములు వృద్ధినొందునట్లు దయానందసరస్వతి బీజము వేశాడు. దయానంద సరస్వతి పూర్తి అరవై సంవత్సరములు కూడా బ్రతుకలేదు. ఆయన జీవితమంతా తాను ఏదో తెలుసుకోవాలని దేశమంతా కాలినడకన తిరుగుతూ వచ్చాడు. చివరకు తన యాభైయవ సంవత్సరము బొంబాయి (ముంబాయి) చేరి అక్కడ కొద్దికాలముండి చనిపోయాడు. పైకి ఆర్య సాంప్రదాయములను గురించి గొప్పగా చెప్పుచుండినా, తనలో అసంతృప్తిగాయుంటూ తాను తెలుసుకోవలసినది ఏదో ఉంది అని తపన పడేవాడు. ఆయన చనిపోయినప్పుడు కూడా అసంతృప్తితోనే చనిపోయినట్లు తెలియుచున్నది. నేడు కూడా ఎందరో బ్రాహ్మణులు దేవుని గుడిలో పూజలు చేయుచున్నా, ఆ గుడిలోని ప్రతిమలు నిజమైన దేవుళ్ళు కాదు అను అసంతృప్తి తోనే యున్నారు. వారే కాకుండా మేము ద్రావిడులుగా పుట్టి ఆర్యులుగా ఎందుకు మారిపోయామని చింతించు బ్రాహ్మణులు కొందరు కలరు. అటువంటి వారిని అందరినీ సమీకరించి వారితోనే ద్రావిడ బ్రాహ్మణ సంఘములను తయారు చేసి, బ్రాహ్మణుల చేతనే ద్రావిడ ఆచారములు, ద్రావిడ జ్ఞానము గొప్పదని ప్రచారము చేయించగలము. ఇప్పటికే ఎందరో బ్రాహ్మణులు ఆర్యులవైపు నుండి వచ్చి ద్రావిడులవైపు పోవుటకు తగిన జ్ఞానమును తెలుసుకొంటున్నారు. కొందరు బ్రాహ్మణులు "ఆర్య సాంప్రదాయముల వలన మాకు బ్రతుకుతెరువు గలదు, ఆర్యులలో గల యజ్ఞముల వలన, మరికొన్ని పనుల వలన జీవించుచున్నాము. ఇప్పుడు ఒక్కమారుగా వాటిని వదిలితే మేము ఎలా బ్రతుకగలము" అను అనుమానముతోయున్న వారు చాలామంది గలరు.

ఇప్పటికే అన్ని సంశయములకు జవాబులు తెలుసుకొని మా ప్రక్క వచ్చి తాము ద్రావిడ బ్రాహ్మణులుగా తయారైన వారు ఎందరో కలరు.

బ్రతుకుతెరువు సమస్యలో చిక్కుకొన్న వారికి మేము చెప్పునది ఏమనగా! నీవు ఏమి చేయుచున్నావో ఆ పనిని వదలుకొమ్మని మేము చెప్పలేదు. ఒకవేళ ఆర్య సాంప్రదాయములోని యజ్ఞములు చేయుచూ, వేదమంత్రములు చదువుతూ జీవనమును గడుపుచుండినా మేము వాటిని వదలితే ఎలా బ్రతుకగలము అను సంశయమును వదలివేయండి. ఎవరు ఎలా బ్రతకాలో ముందే నిర్ణయింపబడియున్నది. మన ప్రమేయముతో మనము బ్రతుకు చున్నామనుకోవడము పొరపాటు. అయినా మీకు అర్థమగులాగున మేము చెప్పునది ఏమనగా! యజ్ఞములనునవి ఆర్యసాంప్రదాయములో భాగము లైనా, వాటిని తప్పక చేయవలసి వచ్చినా చెయ్యి, అట్లయినా నీవు ద్రావిడునివి అని అనిపించుకోవచ్చును. ఆర్యుల జ్ఞానము అంతయూ బయటి కార్యముల మీద ఆధారపడియుంటుంది. అదే ద్రావిడ జ్ఞానము అంతయూ బయటి పనులమీద కాకుండా లోపలి భావముల మీద ఆధారపడి యుంటుంది. అందువలన మేము పనులను ఖండించము, ఆర్య భావములను ఖండించు చున్నాము. భావములు మారినప్పుడు కార్యములు దానంతటవే మారగలవు. బ్రతుకుతెరువులో కూడా మంచి మార్పే రాగలదు. అందువలన బ్రతుకు తెరువు కొరకు ఎవరూ ఆలోచించుకోవలసిన అవసరము లేదు.

ఆర్య జ్ఞానము ప్రకారము బయటి యజ్ఞములు చేసినా, చేయించినా వారి దృష్ఠిలో చేసినవాడు కూలివాడుగానే యుండును. అదే ద్రావిడ జ్ఞానము ప్రకారమున్న జ్ఞానయజ్ఞము చేసి చూపించు, అప్పుడు వారి దృష్ఠిలో యజ్ఞము చేసినవాడు గురు సమానుడుగా కనిపించగలడు. నీవు యజ్ఞము చేయడము వలన, చేయించువాడు ఉండక అందరూ చేయుటకు పూనుకొందురు. అలా ఎదుటి మనిషిలో గొప్ప భావమును తెచ్చిపెట్టు భగవద్గీతలోనున్న ద్రావిడ యజ్ఞమును గురించి తెలిపినంతమాత్రమున గౌరవము లభించును. పూజ్యభావము ఏర్పడడమే కాకుండా అందరి భావములలో మార్పు వచ్చును. అందువలన ఆర్యసాంప్రదాయములు

బయటి కార్యముల మీద ఆధారపడి యున్నవనీ, ద్రావిడ సాంప్రదాయములు లోపలి భావముల మీద ఆధారపడియుండుననీ తెలుపుచున్నాము. ద్రావిడ జ్ఞానము ప్రకారము లోపలి భావములనుబట్టి కనిపించని ఫలితముండును. అలాగే ఆర్య జ్ఞానము ప్రకారము బయటి కార్యములనుబట్టి కనిపించే ఫలితము ఉంటుంది. చివరకు కనిపించే ఫలితము, కనిపించని ఫలితము మీద ఆధారపడియున్నది. అందువలన ఆర్యజ్ఞానముకంటే ద్రావిడ జ్ఞానము గొప్పదని చెప్పవచ్చును.

**ప్రశ్న :- ద్రావిడ సమాజమును పునరుద్ధరించుటకు ప్రథమముగా మీరు చేయు కార్యమేమి?**

**జవాబు :-** శూద్రులను బ్రాహ్మణులుగా మార్చుటకు, శూద్రులకు ద్రావిడ జ్ఞానము బోధించడము ముఖ్యమైన ప్రాథమిక కార్యమైనా, ఆ పనిని నేను చేయను. ఆ పనిని ఇతరులతో చేయించుటకు తగిన విధముగా చేయుటయే నా ప్రథమ కర్తవ్యము. పెద్దలు ఒక సామెతను చెప్పుచుందురు. కొట్టిన వానితోనే చీమిడి తీయించుకొంటే ఏడ్చే పిల్లవానికి హాయిగా ఉంటుందట. ఈ సూత్రము ప్రకారము ఎవరి వలన ద్రావిడులు తమ ప్రాబల్యమును కోల్పోయారో, వారే తమను తిరిగి ద్రావిడులుగా మార్చితే బాగుంటుందను కొంటున్నాను. కావున ఇప్పుడున్న బ్రాహ్మణులకు మీరు పూర్వము ద్రావిడ జాతికి చెందినవారని తెలిపి, ద్రావిడ బ్రాహ్మణుడు ఎంత గొప్పవాడో తెలిపి, ఆర్య బ్రాహ్మణునిగా ఉండవద్దని, తిరిగి పూర్వ చరిత్ర ప్రకారము ద్రావిడ బ్రాహ్మణునిగా మారమని తెలిపి, అలా మారుటకు వారికి కావలసిన "ద్రావిడ" జ్ఞానమును (ఆత్మజ్ఞానమును) అందించి మొదట బ్రాహ్మణులైన వారికి వారి చరిత్ర తెలిపి, తిరిగి పూర్వపు బ్రాహ్మణునిగా మార్చితే, ద్రావిడ బ్రాహ్మణునిగా మారినవాడు తమ చరిత్ర గొప్పదని తెలియగలిగి, తన ద్రావిడ జాతిని తానే ఉద్ధరించుకొనుటకు పూనుకొనును. ఆ విధముగా

బ్రాహ్మణులయిన వారే శూద్రులుగాయున్న వారిలోని క్షుద్రత్వమును తీసివేసి పవిత్రులుగా, ఆత్మజ్ఞానులుగా, ద్రావిడులుగా మార్చగలరు. అప్పుడు నేనొక్కడిని చేయవలెననుకొన్న పనిని వేయిమంది బ్రాహ్మణులు చేసి తిరిగి కృతయుగములోని సమాజమును నెలకొల్పుదురు. ఆనాడు కులములే కాదు, ఏ మతము కూడా భూమిమీద ఉండదు. ఎవరు ఏ మతములో యున్నా ప్రపంచమంతా ఏకకులముగా మారిపోగలదు. అందరూ దేవుని వారసులమని చెప్పుకోగలరు. దేవుడు ఎవరో, తాము ఎవరో అందరికీ ఒక అంచనా వచ్చియుండుట వలన, వాస్తవము తెలిసిన మనుషులందరూ గతములో తమ మతములు వేరుగాయున్నా, ఇప్పుడు మాత్రము మేము అందరమూ ఒకే దేవుని వారసులము, దేవుని ఆస్తి అయిన దైవజ్ఞానములో అందరమూ సమాన భాగస్వాములము అని చెప్పుకొందురు.

**ప్రశ్న :- మీరు ఏమీ అనుకోకపోతే ఒక ప్రశ్న అడుగుతాను. దానికి సూటిగా జవాబును చెప్పండి. ఇప్పుడు మీరు చెప్పినదంతా ఊహాజనిత కార్యమగునుగానీ, ఆచరణయోగ్య కార్యమని నేను అనుకోవడము లేదు. నామాట తప్పయితే క్షమించండి.**

**జవాబు :-** ఏ కార్యమైనా మొదట తన లోపల ఆత్మ అందించు ఊహతోనే ప్రారంభమగును. అయితే కొన్ని పనులు జరుగును, కొన్ని పనులు జరుగవు. జరుగని కార్యములను కొందరు ఊహాజనిత కార్యములే, ఆచరణయోగ్యము కాని కార్యములు అని అంటుంటారు. ఊహకు వచ్చిన కొన్ని కార్యములు జరుగవచ్చును, జరుగకపోవచ్చును. అంతమాత్రమున అన్ని కార్యములను ఆచరణయోగ్యము కాని కార్యములు అని అనకూడదు. పైకి బొమ్మలవలె మనుషులు కనిపించినా, లోపల నిర్ణయించి ఆడించువాడు ప్రత్యేకముగా యున్నాడు కావున, ఇది ఆచరణయోగ్యముగాని పని అని ఎవరూ చెప్పుటకు వీలులేదు. నేను ఇంతవరకూ చెప్పిన ద్రావిడ పునరుద్ధరణ దైవజ్ఞానముతో

ముడిపడియున్నది. కావున మనము చేయవలసిన పనిలేదు. అనుకొంటే ఆత్మయే చేయగలదు. జరిగెడి ప్రతి పనినీ ఆత్మ చేయుచున్నా, చేయించు చున్నా ఆత్మజ్ఞానము తెలియని మనుషులకు తామే చేసినట్లుండును. అందువలన ఎవరు చేస్తున్నారు అనునది బయట చూపుకు ఎవరికీ అర్థము కాదు. అయితే ఇక్కడ నేను చేశాను అనునది ముఖ్యముకాదు కానీ, ఏమి జరిగింది, ఏమి జరుగబోతుంది అనునదే ముఖ్యము. ఇప్పుడు ఆర్యులలో కలిసిపోయిన బ్రాహ్మణులు ద్రావిడ బ్రాహ్మణులుగా ముందు రూపాంతరము చెందుతారని, తర్వాత అదే బ్రాహ్మణులే అన్ని కులములవారినీ, అన్ని మతముల వారినీ ఏకతాటిమీదికి తేగలరనీ అనుకొన్నాము.

బ్రాహ్మణుడు అనగా పెద్దవాడనీ లేక బ్రహ్మజ్ఞానము తెలిసినవాడనీ అర్థము కలదు. ఏదైనా తెలియనివాడు తెలుసుకోవాలంటే, తెలిసినవాని వద్దనుండే తెలుసుకోవలెను. అలాగే పెద్దవాడు లేక పెద్ద జ్ఞానముకలవాడు అని అర్థమున్న బ్రాహ్మణుని వద్దనుండే ఏదైనా తెలియవలెను. అందువలన పద్ధతి ప్రకారము మొదట బ్రాహ్మణుడయిన వానిని అసలైన బ్రహ్మజ్ఞాన బ్రాహ్మణునిగా (ద్రావిడ బ్రాహ్మణునిగా) చేయగలిగితే, ఆ బ్రాహ్మణుడు మిగతా మూడు ఆత్మల జ్ఞానములేని వారిని జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మలయొక్క జ్ఞానమును తెలిపి మిగతా శూద్రులనందరినీ బ్రాహ్మణులుగా మార్చగలడు. తెలిసినవాడు తెలియనివారిని తెలిసినవారిగా చేయగలడు అను సూత్రము ప్రకారము బ్రాహ్మణుని చేతనే మిగతా వారిని బ్రాహ్మణులుగా మార్చగలనని అనుకొంటున్నాను. ఇది జరుగబోవు పని కావున జరిగితీరును.

**ప్రశ్న :- బ్రాహ్మణుని చేత మిగతావారిని బ్రాహ్మణులుగా చేయిస్తాననీ, ఆ పనిని నేను చేయనని చెప్పారు. అయితే మొదట బ్రాహ్మణులయిన వారిని**

**నిజమైన ద్రావిడ బ్రాహ్మణులుగా తయారు చేస్తానని చెప్పారు. బ్రాహ్మణ అంటే పెద్దయని చెప్పి తెలిసినవాడని చెప్పి, సూత్రము ప్రకారము ఏదైనా బ్రాహ్మణుని చేతనే చేయిస్తానని చెప్పి, ప్రస్తుతము శూద్రుల కులమున వున్న మీరు మొదట బ్రాహ్మణున్ని నిజమైన బ్రాహ్మణునిగా నేనే మారుస్తానని అన్నారు. అప్పుడు బ్రాహ్మణుడే తెలుపాలి అను సూత్రమును మీరు పాటించ లేదు కదా!**

**జవాబు :-** తెలిసినవాడు తెలియనివారికి చెప్పగలడు అనియూ, పెద్దయిన వాడు చిన్నయిన వానికి చెప్పగలడు అనియూ, బ్రాహ్మణుడే మిగతా వారిని బ్రాహ్మణులుగా మార్చగలడని చెప్పినది వాస్తవమే. నేను ప్రతి దానిని సూత్రము ప్రకారమే చేయుచున్నాను. మీకు నేను శూద్రుడనయినా నేను ఎప్పటికీ ద్రావిడ బ్రాహ్మణున్నే. ప్రపంచములో శూద్రుల కులమున పుట్టినప్పటికీ నేను చరిత్ర మరువని వాడిని, కనుక నేను నిజమైన బ్రాహ్మణున్ని. అందువలన కార్యమును మొదట నేనే ప్రారంభించి, తర్వాత మిగతా వారిచేత చేయించుదును. నేను మొదటికే నిజమైన బ్రాహ్మణున్నే కావున నేనే ప్రారంభించుచున్నాను.

ప్రశ్న :- **మీరు ప్రతి దైవ జ్ఞాన విషయమును అందరికీ తెలియునట్లు చేయాలనీ, ఏదీ దాచుకోకూడదని చెప్పుచుందురు. ఇప్పుడు కూడా అన్ని విషయములను దాచుకోకుండా చెప్పుచునే యున్నారు. ఇంతకుముందు మేము ఇతర మతస్థులకు వారి జ్ఞానమును తప్ప ఇతరుల జ్ఞానమును వినము అను చాదస్తముగాయున్న మొండి మనుషులకు మీరు జ్ఞానమును ఎలా చెప్పినా చెవిలోనికి ఎక్కించుకోని వారికి, మీరు ఎలా జ్ఞానమును చెప్పుదురు అని అడుగగా! మీరు చక్కిలిగిలి సూత్రమును ఉపయోగించి చెప్పుతాను అన్నారు. అయితే చక్కిలిగిలి సూత్రమును ఇతర మతముల**

**వారి ఎడల, మేము పట్టుకున్న కుందేలుకు మూడే కాళ్ళున్నాయి అని చెప్పు మొండివాదుల దగ్గర చక్కిలిగిలి సూత్రమును ఎలా ఉపయోగిస్తారు? అసలు చక్కిలిగిలి సూత్రమంటే ఏమిటి? కొంత వివరముగా, మాకు అర్థమయ్యే లాగున చెప్పమని కోరుచున్నాను.**

**జవాబు :-** చక్కిలిగిలి అనునది శరీరములో ఎక్కడో పరిమితమైన స్థలములలో ఉండును. ఆ స్థలములలో స్పర్శ తగిలితే మనిషిలో కదలిక, చురుకుతనము వచ్చుట వాస్తవమే. అలాగే మనిషి దేనిలో ఒప్పుకోకపోయినా కొన్ని విషయములలో తప్పనిసరిగా ఒప్పుకొని తీరును. ఒక మగవాని దగ్గరకుపోయి నీవు ఆడదానివి కాదు అంటే ఆ మాట నిజమేనననుగానీ, నీ మాట అబద్దము నేను ఆడదానిని అనడు. అదే విధముగా నేను మంచివాడనను అభిప్రాయము అందరిలోనూ ఉండును. అటువంటి వానిని చూచి నీలో చెడు అనునది లేనే లేదు అంటే, నిజము చెప్పావని చెప్పినవానిని పొగడును. ఈ విధముగా ఏ విషయములో ఒప్పుకోనివాడు కొన్ని విషయములలో మాత్రము పూర్తిగా ఒప్పుకొనును. ఎటువంటివాడయినా చక్కలిగిలికి నవ్వినట్లు, ఎటువంటి వాడయినా కొన్ని విషయములలో మౌనము వీడి తన ఉద్దేశ్యమును తెలుపును. అదే విధముగనే ఏ మతము వాడయినా, తన మతమును వదలి ప్రక్కమతము దంతా తప్పేయని చెప్పువాడయినా, సామాన్యముగాయున్న కొన్ని వాక్యములకు లొంగిపోయి అది నిజమేనని చెప్పును. ఒక హిందువు మరియొక ముస్లీమ్ దగ్గర తన దేవతలయిన విష్ణు, ఈశ్వరులను గురించి చెప్పితే, ముస్లీమ్ ఇదంతయూ అబద్ధము, వీడు పొరపాటు పడిపోయి, దేవున్ని వదలి అన్యదేవతలను పట్టుకొన్నాడు. వీరిది జ్ఞానమే కాదు అని అనుకొనును. అట్లు దేవతలను గురించి చెప్పక, మన ఇద్దరి శరీరములోని అవయవములు ఒకే విధముగా పనిచేయుచున్నవి అని అంటే, దానిని ఆ ముస్లీమ్ తప్పక ఒప్పుకొనును. మనము ఇద్దరమూ బయటయున్న ఒకే గాలిని శ్వాసగా పీల్చుచున్నాము

అంటే దానిని ఆ ముస్లీమ్ ఏమాత్రము కాదనడు పైగా నిజమే కదా! అని అనును. అట్లే నిన్ను పుట్టించిన దేవుడు, నన్ను పుట్టించిన దేవుడు ఇద్దరు కాదు ఒక్కడే అంటే, ముస్లీమ్ సంతోషపడి సరియైన మాట చెప్పావని పొగడును. ఏదో ఒకరోజు ప్రతి మనిషికీ చావు వుంటుందని చెప్పితే దానిని కూడా సత్యమని ఒప్పుకొనును. మొదట విష్ణువు, ఈశ్వరుడు అని చెప్పిన మాటలను ఏమాత్రము ఒప్పుకోనివాడు. తర్వాత మాట్లాడిన మాటలన్నిటినీ ఒప్పుకోవడమే కాకుండా, సరియైన మాటలు చెప్పావని పొగడడము కూడా జరిగినది.

అదే విధముగా మనిషి శరీరములోని మనస్సును గురించి, బుద్ధిని గురించి, చెడు గుణముల గురించి, మంచి గుణములను గురించి, అవి మన శరీరములో ఎట్లు పని చేయుచున్నదీ, ఆ పనుల వలన ఫలితము వచ్చు విధానమును ఎట్లున్నదీ చెప్పితే, అంతవరకు తనకు తెలియని మనస్సును గురించి, బుద్ధిని గురించి చెప్పిన విషయములు తెలిసినవని సంతోషపడును. తర్వాత భగవద్గీతలో దేవుడు చెప్పిన విషయములు కూడా ఖుర్ఆన్ గ్రంథములో కూడా ఉన్నాయని, వాటిని గురించి చెప్పితే అది తమ ఖుర్ఆన్ గ్రంథము యొక్క జ్ఞానమే అయినందున చెప్పేవానిని గౌరవముగా చూడడం ఆరంభించును. ఎప్పుడయితే జ్ఞానము చెప్పే మనిషిమీద గౌరవభావము వచ్చినప్పుడు, అతడు చెప్పినదంతా సత్యమే అయి ఉండునని అనుకొనును. మొదట మేము నీ మాటలు వినము అన్న మనిషే అతడు ఏ మతస్థుడయినా గానీ, శరీరములోని జ్ఞానము తప్పనిసరిగా అతనిని ఆకర్షితుని చేయును. ముస్లీమ్‌ల ఖుర్ఆన్ గ్రంథములోగానీ, క్రైస్తవుల బైబిలులోగానీ, హిందువుల భగవద్గీతలో గానీ, బయట విషయములు చెప్పక మూడు గ్రంథములందు ఒకే దేవుని విధానముతో, ఒకే జ్ఞానమును బోధించుటను చూచినవారు, తమ జ్ఞానము ఇతర మత గ్రంథములలో

ఉండుటను చూచి సంతోషింతురు. తమ వాక్యములను చూచిన తర్వాత మన మతములో ఉన్నదే ఇతర మతములలో కూడా చెప్పబడినదని తెలిసి, ఇతర మతములలోని వాక్యములను చూచినా, అది నా మతములోని జ్ఞానముతోనే ఉన్నదని అనుకొనుటకు మొదలు పెట్టును. ఈ విధముగా కొంత కాలమునకు అతనిలో ఏమాత్రము వాళ్ళు వేరు, మేము వేరను భావము లేకుండా పోవును. అంతా ఒక్కటేనను భావము వచ్చును. చూచారు కదా! మొదట హిందువు చెప్పే ప్రతిమాటను వ్యతిరేఖించువాడు, కొంతకాలమునకు అదే హిందువు చెప్పిన జ్ఞానమును, మాటలను పూర్తి సత్యమని తెలియగలిగాడు. మొదట నేను మీ జ్ఞానమును వినను అని చెప్పినవాడే తిరిగి ఇది సత్యమైన దైవజ్ఞానమని చెప్పగలుగుచున్నాడు. ఈ విధముగా మొదట వినేవానియొక్క అభిరుచిని గుర్తించి, దాని ప్రకారమే మాట్లాడడమును గిలిగింత జ్ఞానము అని చెప్పవచ్చును. ఈ సూత్రమును అనుసరించి ఎంతటి వానికైనా ఎంతటి అజ్ఞానమున్న వానికైనా సులభముగా చెప్పవచ్చును. ఈ పద్ధతి ప్రకారమే మేము ఆర్యులను ద్రావిడులుగా మార్చవలెనని అనుకొన్నాము.

ప్రశ్న :- **బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులను నాలుగు జాతులుగా మనుషులున్నారని చెప్పి, అందులో చివరివారయిన శూద్రులను మాత్రము అనేక కులములుగా విభజించారు. వైశ్య, క్షత్రియ అను రెండు జాతులను విభజించలేదు, ఎందుకు అలా చేశారు?**

**జవాబు :-** ఆర్యులు త్రేతాయుగము మొదటిలోనే ఇందూదేశమునకు రాకముందే, వారిలో మూడు లేక నాలుగు తెగలు ఏర్పడివుండేవి. కులముల పునాది ఆర్యులలో మొదట ఆసియా ఖండములోనే ఉండేది. అయితే ఆర్యులు ఇందూదేశమునకు వచ్చిన తర్వాత ద్రావిడులను చూచి, వారి కులరహిత సమాజమును చూచి, ఓర్వలేక తమను మాత్రము మొదట

బ్రాహ్మణులుగా చెప్పుకొనుచూ, ఇందువులలోని వారిలో ఆర్యులకు అనుకూలమైన వారిని వైశ్య, క్షత్రియ కులములుగా విభజించారు. ఆర్యులు ఒక కులమువారు కాగా, రెండవ కులమువారు వైశ్యులు, మూడవ వారు క్షత్రియులు. మూడు కులములకు మూడు పేర్లు పెట్టుకొన్న తర్వాత ఇందూదేశములోని మిగతా ద్రావిడులనందరినీ శూద్రులుగా చేశారు. అప్పటికే బ్రాహ్మణ మాదిగువవారు అను రెండు భాగములుగా యున్న వారిని అట్లేయుంచి శూద్రులలోనే అంటరానివారిగా పంచములను ఐదవ జాతిని కూడ తయారు చేశారు. ఈ విధముగా లెక్కించితే మొత్తము ఐదు జాతులుగా ప్రజలను విభజించడము జరిగినది. అందులో బ్రాహ్మణ అనువారు ఆర్యులకు సంబంధించినవారనీ, మిగత వైశ్య, క్షత్రియ, శూద్ర, పంచమ అను నాలుగు ద్రావిడులకు సంబంధించినవనీ ప్రచారము చేశారు. అయితే ఆసియానుండి వచ్చిన వారందరినీ ఆర్యులని చెప్పుకొని, ఇందు దేశములో ఆర్యులకు అనుకూలముగా యుండిన వారిని మాత్రము వైశ్య, క్షత్రియ అను రెండు పేర్లతో చెప్పారు. అనుకూలముగాలేని వారందరినీ శూద్రులుగానూ, పంచములుగానూ చెప్పడము జరిగినది.

ఆర్యులు కులవిభజన సమయములో ఎంతో ముందు చూపుతో వ్యవహరిస్తూ, ద్రావిడులలోనే తమకు అనుకూలమైన వారిని వైశ్య, క్షత్రియ అని రెండు రకములుగా చెప్పి, అనుకూలము లేనివారిని శూద్ర, పంచమ అని రెండు రకములుగా చిత్రించి చెప్పారు. దీనినిబట్టి ఇందూదేశములోని ద్రావిడులను ఆర్యులు నాలుగు రకముల వారిగా విభజించి, తాము మాత్రము ప్రక్కన ఆర్యులుగానేయున్నారు. అయితే అనుకూలముగాయున్న వైశ్యులను, క్షత్రియులను తమ వారిగా చెప్పుకొనుచూ, వైశ్యులను ఆర్య వైశ్యులనీ, క్షత్రియులను ఆర్య క్షత్రియులని చెప్పడము జరిగినది. జరుగబోవు కాలములో ద్రావిడులు తమకు అనుకూలముగా ఉండునట్లు, వైశ్య, క్షత్రియ

రెండు కులముల వారినీ తమపేరుతో పిలుచునట్లు ప్రయోగము చేశారు. అయితే అందులో ఆర్యవైశ్య అనుమాట శాశ్వతముగా నిలిచిపోయినది. రెండవ దయిన ఆర్య క్షత్రియ అనుమాట శాశ్వతముగా రాణించలేక పోయింది. చివరకు క్షత్రియ అను పేరుమాత్రము మిగిలిపోయినది. ఆర్యక్షత్రియ అనుపేరు నిలువలేక క్షత్రియ అను పదము మాత్రము మిగిలిపోయినది. అయినా క్షత్రియులు కూడా రెండు తెగలుగా కలియుగములో చీలిపోయారు. వారిలో సూర్య వంశము వారనీ, చంద్రవంశము వారనీ త్రేతాయుగములోనే చీలిపోవడము జరిగినది.

అప్పటినుండి చంద్రవంశ రాజులు, సూర్యవంశ రాజులు అను పేరును వింటున్నాము గానీ, ఎక్కడా కూడా ఆర్య క్షత్రియులను మాటను వినలేదు. ఆర్య క్షత్రియులని ఆర్యులుంచిన పేరు చిరకాలము నిలువలేక పోయినది. క్షత్రియులు అనగా క్షాత్రముగలవారు అని అర్థము. క్షాత్రము అనగా పౌరుషము అని ఒక అర్థము. భూమి అను ఒక అర్థము రాగలదు. ఈ రెండూయున్నవారు రాజులు అని తెలియుచున్నది. పౌరుషము అనగా మగతనము లేక పురుషత్వము అని అర్థము. పురుషత్వమును బట్టి ఎక్కువ వివాహములు గలవారు రాజులే ఉండిరి. అలాగే భూమిని ఆక్రమించుకొని ఎక్కువ భూమి మీద అధికారముగలవారు కూడా రాజులే అయినందున క్షత్రియులను రాజులుగా చెప్పడము జరిగినది. అటువంటి రాజుల వద్ద ఆర్యులు రాజగురువులుగా యుంటూ, రాజులకు అనేక ఉపాయములను, సలహాలను చెప్పుచూ, రాజస్థానములో మంచి ఉన్నతస్థానములో ఉండెడి వారు. ఆర్యులు తమకు అనుకూలముగా తయారు చేసుకొన్న వైశ్య, క్షత్రియులలో క్షత్రియులు రాజులుగాయుంటూ ఉన్నత స్థితిలో భూమిమీద నివసించుచుండగా! వైశ్యులు కూడా వ్యాపారవృత్తిని కల్గి రాజులవలె శ్రమలేని జీవితమును గడుపుచుండిరి. ఆర్యులు పేరుపెట్టిన వైశ్య, క్షత్రియులను రెండు జాతులు భూమిమీద సుఖజీవనమును సాగించు

చుండగా, మిగతా రెండు జాతులైన శూద్రులు, పంచములు అనువారు శ్రమతో కూడుకొన్న పనులు చేయుచూ జీవించుచుండిరి.

శూద్రులు అను మాటను పలుకుచున్నా దాని అసలు పేరు అది కాదు. క్షద్రములు చేయువారు క్షూద్రులు అని అనెడివారు. క్షద్రము అనగా నీచము అని అర్థము. నీచమైన పనులు చేయువారు నీచులు అనియూ, వారినే క్షూద్రులు అనియూ అనెడివారు. క్షూద్రులు అని పలుకడములో కొంతమార్పు వచ్చి అదే పదమే చివరకు శూద్రులు అని పలుకబడుచున్నది. కొందరు నోరు తిరుగక శూద్రులు అని పలికినా శూద్రులు అనువారు క్షద్రమైనవారను (నీచమైనవారను) భావముతోనే యున్నారు. అయితే శూద్రులు అను పదము యొక్క అర్థము క్షూద్రులు అను పదమునకు పూర్తి వ్యతిరేఖముగా యున్నది. అదెలాయనగా! శుద్ధము అనగా పవిత్రము అని అర్థము నిచ్చును. దానిప్రకారము శుద్ధులు అనగా పవిత్రులనియూ, శూద్రులు అనగా పవిత్ర పనులు చేయువారనియు చెప్పవచ్చును. ఆర్యులు శూద్రులను నీచమైనవారిగా చెప్పుటకు క్షూద్రులు అని చెప్పినప్పటికీ, అదే పదము కాలక్రమమున శూద్రులుగా మారి పోయినది. అయినా శూద్రులు అను పదమును మనము ఈ దినము వాడుచున్నా, దానిని ఏ అర్థముతో వాడుచున్నామో, తెలియని స్థితిలో యున్నాము. కానీ అందరి దృష్ఠిలో బ్రాహ్మణులు, శూద్రులను దూరముగా యుంచి అంటక యుండుట వలన, శూద్రులను తక్కువ వారిగానే అనుకొంటున్నారు. కులవివక్షతో బ్రాహ్మణులు గొప్ప, శూద్రులు నీచమని అనుకోవడము జరుగుచున్నది.

వైశ్యులు వ్యాపారమును చేయుచూ, క్షత్రియులు రాజ్యములనేలుచూ ఉన్నత స్థితిలో ఉండగా వారి ఇరువురికీ మేము పెద్దలము, గురువులము అని ఆర్యులు చెప్పుకొనుచూ, వారిమీద పెత్తనము చెలాయిస్తూ, వారికి

సలహాలు చెప్పుచూ హాయిగా జీవించుచుండిరి. శూద్రులను, పంచములను ప్రక్కనపెట్టి వారిని పూర్తి తక్కువవారిగా చూస్తూ వైశ్య, క్షత్రియులను మాత్రము ఒక విధముగా గౌరవభావముతో చూస్తూ, వారికి ఆర్యవైశ్య, ఆర్య క్షత్రియ అను పేర్లను తగిలించియున్నా క్షత్రియులు ఆర్య అను పేరును చెప్పుకోక కేవలము క్షత్రియులని చెప్పుకొనుచుండిరి. క్షత్రియులను చూచిన వైశ్యులు తాము కూడా ఆర్య అను పదమును తీసివేసి కేవలము వైశ్య అను శబ్ధముతోనే పలుకునట్లు మాట్లాడుకొని, అప్పటినుండి అలాగే చేయుచుండిరి. తమను వైశ్యులుగా చెప్పుకొనుచూ ఆర్యవైశ్య అను పదమును ప్రక్కన పెట్టారు. క్షత్రియులు, తాము పెట్టిన ఆర్య పదమును వదలినప్పుడు దానిని గురించి ఆర్యులు పెద్దగా పట్టించుకోలేదు. అయితే క్షత్రియులవలె వైశ్యులు కూడా తమ పేరును ప్రక్కన పెట్టి చెప్పుకోకపోవడము ఆర్యులకు మ్రింగుడు పడలేదు. అలా వైశ్యులు తమ పేరును చెప్పకపోవడమును తమకు అగౌరవముగా భావించి, ఎలాగయినా వైశు ్యల చేత తమ పేరును చెప్పించుకోవాలనుకొన్నారు. క్రొత్త పథకమును వేయడములో అరితేరిన వారు ఆర్యులు గనుక, అప్పుడు తమ పథకము ప్రకారము శూద్రులలో ఒక కొత్త కులమును సృష్ఠించారు. వస్తువులను అమ్ముకొను వృత్తిలో బ్రతుకువారు వైశ్యులనీ, శరీరమును అమ్ముకొను వృత్తిగలవారు వేశ్యలనీ క్రొత్త కులమును సృష్ఠించారు. వేశ్యలను కొత్త పేరు రావడముతో వైశ్యులు, వేశ్యలు అను రెండు దగ్గర శబ్ధముతోనున్న పేర్లు రావడము జరిగినది.

ఈ విధముగా శూద్రులలో వేశ్యలు అను కులము మరొకటి ఉన్నదని తెలిసినప్పుడు దానివలన వైశ్యులకు ఒక చిక్కువచ్చి పడినది. అటువంటి చిక్కుసమస్య రావలెనను ఉద్దేశ్యముతోనే ఆర్యులు వేశ్య కులమును తయారు చేసినట్లు అర్థమగుచున్నది. ప్రజలు పలుకడములో వైశ్యులు అని పలుకుచోట నోరు తిరగక వేశ్యలు అని పలుకడము. వేశ్యలు అను

పలుకుచోట వైశ్యులు అని పలుకడము జరిగెడిది. అయితే వైశ్యులు అను పదమును ఎక్కువమంది వేశ్యలు అని పలుకడము వలన వైశ్యులకు అది అగౌరవముగా, అవమానముగా కనిపించసాగింది. అలాంటపుడు వైశ్యులు అందరూ కలిసి తమను ఆర్యవైశ్యులుగా చెప్పుకోవడము మంచిది అనుకొన్నారు. తమ వైశ్య శబ్ధమునకు ముందు ఆర్య శబ్ధముంటే పలికేవారు ఎలా పలికినా వీరు ఫలానా వైశ్యులని అర్థము కాగలదనీ, అట్లు ఆర్య శబ్ధము లేకపోతే కొంత కాలమునకు తమ వైశ్యుల స్థానములో వేశ్యల శబ్ధము నిలిచిపోగలదనీ, అప్పుడు తాము కూడా శూద్రులుగా లెక్కించబడుదమనీ, అట్లు కాకుండుటకు ఆర్య వైశ్యులమని చెప్పుకోవడము మంచిదనీ అనుకొన్నారు. అప్పటినుండి తమను వేశ్య కులమునుండి రక్షించుకొనుటకు ఆర్యవైశ్యులు అని చెప్పుకోవడము మొదలుపెట్టారు. అప్పటినుండి భారతదేశములో ఆర్యవైశ్యులని పేరు రావడము జరిగినది.

అయితే వైశ్యులలో కొందరు ఆర్యులకంటే తెలివైనవారు కలరు. ఆర్యుల తెలివి బయట పనిచేస్తే, వైశ్యులలో లోపల బయట రెండు విధములుగా బుద్ధి పనిచేయువారు అక్కడక్కడ ఉండెడివారు. ఆర్యులు మేము తెలివైనవారము అని అందరికీ తెలియునట్లు ప్రవర్తించినా, వైశ్యులలో కూడా కొందరు ఆర్యులతోపాటు గానీ, ఆర్యులకంటే మించిన తెలివిగలవారుగా గానీ ఉండెడివారు. ఆర్యులకంటే మించిన తెలివిగల వారు ఆనాడు వైశ్యులలో ఉండుట వలన, ఆర్యులు తమమీద పథకము ప్రకారము ఆర్య అను పదమును అంటించారని అర్థము చేసుకొన్నారు. ఇప్పుడు ఆర్య అను పదమును తీసివేస్తే తాము వేశ్య అను శబ్ధముతో పలుకబడుదమని అర్థము చేసుకొని ఏమీ చేయలేక ఆర్య అను పదమును విడిపించుకోలేక చివరకు ఆర్య వైశ్యులుగానే మిగిలిపోయారు. అప్పటినుండి ఇప్పటి వరకు తమను ఆర్యవైశ్యులని చెప్పుకొనుచుందురు. ఎక్కడైనా బోర్డులలోగానీ, ప్రకటనలలోగానీ తమ కుల సంఘము పేరును

వ్రాయునప్పుడు ఆర్యవైశ్య సంఘము అని వ్రాయుచుందురు. తమ వెనుక వచ్చు తమ పిల్లలకు కూడా తమను ఎక్కడ వ్రాసుకొన్నా ఆర్యవైశ్య అను పేరుతోనే వ్రాయాలని చెప్పడము కూడా కలదు. ఇదంతయు త్రేతాయుగము లోనే జరిగిన తతంగము అయినందున, చాలామంది వైశ్యులకు తమ చరిత్ర పూర్తి తెలియకుండా పోయినది. అయినా పూర్వము ఆర్యులు చేసిన కుతంత్రమునకు సాక్ష్యముగా ఆర్యవైశ్య అను శబ్ధము నేటికినీ నిలిచి యున్నది. చరిత్ర తెలియకుండా పోయినా, ప్రస్తుతమున్న సాక్ష్యము యొక్క ఆధారముతోనే జరిగిన విషయము ప్రత్యక్షముగా అర్థమగుచున్నది.

నేటి వైశ్యులు కూడా కృతయుగములోనున్న ద్రావిడులే అయినందున ఆర్యులు వారి అసూయ బుద్ధితో ఎవరినీ వదలక అసూయను అందరిమీదికీ ప్రయోగించారు. అటువంటి ప్రయోగమే ఆర్యవైశ్య అనునది. పూర్వము ఆర్యులు చేసిన మోసము నేటి వైశ్యులకు తెలియకుండా పోయివుండవచ్చును. కాలగమనములో వారు మరచిపోయివుండవచ్చును. అయితే పూర్వమున్న వైశ్యులలోని కొందరు ఆర్యులకంటే మించిన మేధావులైవుండుట వలన, ఆర్యులు చేసిన మోసమును గ్రహించినవారై, ఆర్య అను పదమును విడిపించు కోని స్థితిలో ఉండి, ఆర్యులు తమకు చేసిన మోసమునకు తాము బదులుగా ఏమి చేయాలని ఆలోచించారు. తమలో తాము సమావేశములు పెట్టుకొని, ఆర్యులను మించినవారుగా సమాజములో కనిపించాలంటే ఏమి చేయాలని తర్కించి చూచుకొన్నారు. చివరకు వైశ్యులలోని మేధావుల సూచనల మేరకు తమను ఆర్యులకంటే గొప్పగ కనిపించునట్లు, సమాజములో అందరికీ తాము ఆర్యులకంటే శ్రేష్ఠమైనవారమన్నట్లు అర్థమగుటకు తమ పేరు చివరిలో శ్రేష్ఠి అను బిరుదును తగిలించుకోవాలనుకొన్నారు. అంతేకాక ప్రపంచ జ్ఞానములోనూ, పరమాత్మ జ్ఞానములోనూ, ప్రపంచ మనుజులలోనూ అందరికంటే శ్రేష్టత

తమవద్ద కలదను సూచనమేరకు తమను శ్రేష్ఠి అను శబ్ధముతో అందరూ పిలుచునట్లు, అందరూ పలుకునట్లు పేరు చివర శ్రేష్ఠి అను రెండు అక్షరములను వ్రాసుకోవడము జరిగినది. శ్రేష్ఠి అనునది ప్రపంచ శ్రేష్ఠతను, జ్ఞానశ్రేష్ఠతను గురించి తెలియజేయునదిగా యున్నప్పటికీ పరమాత్మ జ్ఞానములో కూడా మేము ప్రత్యేకముగా ఎవరికీ తక్కువగా లేము అన్నట్లు, తమ వారిలో ఎవరు పరమాత్మ జ్ఞానమును తెలిసియుందురో వారి పేరు చివర గుప్త అను పదమును చేర్చి వ్రాసు కోవలయునని నిర్ణయించుకొన్నారు. గుప్తము అనగా రహస్యము అని అర్థము. ప్రపంచములో అత్యంత రహస్యమైనది దైవజ్ఞానము ఒక్కటే గలదు. అందువలన భగవద్గీతలో భగవంతుడు రాజవిద్యా రాజగుహ్య యోగమున 1, 2 శ్లోకములలో తన జ్ఞానమును రాజగుహ్య అనియూ, గుహ్యతమం అనియూ వర్ణించి చెప్పాడు. సంస్కృత భాషలో గుహ్యము అనినా, తెలుగు భాషలో గుప్తము అనినా రెండూ ఒకే అర్థమునిచ్చును. దేవుని జ్ఞానము గుహ్యముగా ఉన్నదని గీతలో చెప్పారు. ఎవరికీ తెలియని రహస్యముగా దేవుని జ్ఞానము కలదను అర్థముతో ఆ మాటను చెప్పారు. రహస్యమైన దేవుని జ్ఞానమును ఎవడైతే తెలియగలడో వాడు రహస్యము తెలిసినవాడని, వానిని గుప్త అని అనవచ్చును. గుప్తమును తెలిసినవాడు గుప్తుడు అని చెప్పుచూ, వైశ్యులలో దైవజ్ఞానమును తెలిసిన వారిని ప్రత్యేకముగా గుప్త అని వ్రాయునట్లు చేశారు. అందువలన ప్రపంచ జ్ఞానము, పరమాత్మ జ్ఞానము రెండూగలవానిని శ్రేష్ఠి అనియూ, దైవజ్ఞానము ఒక్కటే గలవారిని గుప్త అనియు అనడము జరిగినది. త్రేతాయుగములోనే వైశ్యులయందు అంతవరకు లేని శ్రేష్ఠి, గుప్త అను పదములు పేరు చివరిలో రావడము జరిగినది. నేడు వైశ్యులుగా యున్న వారికి బహుశా తమ పేరు వెనుకగల శ్రేష్ఠి, గుప్త అను గుర్తుల యొక్క విశిష్ఠ అర్థము తెలుసునో, లేదో మాకు తెలియదు. ద్రావిడులు అందరూ తమ చరిత్రను పూర్తిగా మరచిపోయినారని

ఒక సందర్భములో చెప్పుకొన్నాము. దాని ప్రకారము పూర్వమున్న వైశ్య మేధావులు ఏర్పరచిన విధానము నేడు తెలియకుండా పోయినదనియే చెప్పవచ్చును. అయితే ఆనాడు వైశ్య మేధావులు చేసిన నిర్ణయములకు సాక్ష్యముగా వైశ్యుల పేరు వెనుక శ్రేష్ఠి, గుప్త అను బిరుదులు నేటికినీ నిలిచియున్నవి.

నేడు ప్రస్తుత కాలములో కొందరు తమ చరిత్రను తామే మరచిపోయి వుండుట వలన, వైశ్యులయిన వారు కొందరు తమ పేరు చివరిలో శ్రేష్ఠి అనిగానీ, గుప్త అనిగానీ ఉంచుకోవడము లేదు. అయితే నేటికినీ తమను ఆర్యవైశ్యులని చెప్పుకోవడము, వ్రాసుకోవడము చేయుచున్నారు. పూర్వము వైశ్యులైన వారు ఆర్యులకంటే గొప్పవారయిన దానివలన, వారిని మించిన పేరు పెట్టుకొనుచూ ప్రపంచ, పరమాత్మ జ్ఞానములో గొప్పవారైనందుకు శ్రేష్ఠి అనియూ, పరమాత్మ జ్ఞానములో మాత్రము గొప్పవారైతే గుప్త అనియూ పేరు చివర పెట్టుకొనెడివారు. వైశ్యులు ప్రపంచ రంగములలోగానీ, పరమాత్మ జ్ఞానములోగానీ ఆనాడు మించి యుండెడివారు. రెండు విధముల జ్ఞానులే అయివుండేవారు. అందులో ఎక్కువమంది ప్రపంచ జ్ఞానములో ఆరితేరి యుండుట వలన, వైశ్యులలో ఎక్కువ శాతము మంది శ్రేష్టులు ఉండేవారు. పరమాత్మ జ్ఞానములో తక్కువ మంది జ్ఞానులు ఉండుట వలన, గుప్త అనువారు తక్కువగా యుండెడివారు. సమాజములో శ్రేష్టులు ఎక్కువ గుప్తులు తక్కువగా యుండుట ఆనాడు అందరికీ తెలిసిన విషయమే. కాలక్రమమున శ్రేష్ఠికి, గుప్తకు అర్థము, భావము తెలియకుండా పోయిన దానివలన వైశ్య కులములో శ్రేష్ఠి, గుప్త అను పదములు వంశపారంపర్యముగా వచ్చు నామధేయములనుకొన్నారు. అందువలన నేడు వైశ్యులలో ప్రపంచ మేధావులు కాకున్నా వారిని శ్రేష్ఠి అని పిలువడము జరుగుచున్నది. తండ్రి

శ్రేష్ఠి అయితే కొడుకు కూడా శ్రేష్ఠియే అగును కదాయనీ, తండ్రి గుప్త అయితే కొడుకు కూడా గుప్త అనియే పిలిపించుకొన్నారు. శ్రేష్ఠి, గుప్త అను పదములు వంశపారం పర్యముగా వచ్చునవి కాదని, చాలామందికి తెలియదు. శ్రేష్ఠి, గుప్త వెనుక ఇంత రహస్యమున్నదనీ, ఈ రెండు పేర్లు ఆర్యులకు బుద్ధి చెప్పుటకు వైశ్య మేధావులు నిర్ణయించిన పదములనీ చాలామందికి గానీ, మొత్తము అందరికీ గానీ తెలియకుండా పోయినదని అనుకొంటున్నాను.

ఆర్యులైన వారు నేడు కూడా ఆర్య సమాజములను ఏర్పరచుకొని మత ఆచార వ్యవహారములు దెబ్బతినకుండా ఉండునట్లు నేటికినీ ఉండి నప్పటికీ, ఇప్పటికీ ఉత్తర దేశమున మేము ఆర్యులము అను జ్ఞప్తితో చాలామంది ఆర్యులు ఉన్నప్పటికీ, వైశ్యుల కులములోయున్న ఆర్యవైశ్య అను పదమునే చూడగల్గుచున్నారు గానీ, వారి దృష్ఠికి శ్రేష్ఠి, గుప్త పదములు రాలేదు. ఆ రెండు పదములను గురించి వారు తెలుసుకొనినా, వారికి అవి అర్థము కూడా కావు. శ్రేష్ఠులకంటే గుప్తులు పెద్ద అను విషయము కూడా వారికి తెలియదు. వారికి తెలియక పోవడమేకాక కొందరు వైశ్యులు తాము ప్రపంచ జ్ఞానులమూ కాదు, పరమాత్మ జ్ఞానులమూ కాదు అన్నట్లు వారి పేరు చివర ఏ గుర్తునూ పెట్టుకోలేదు. శ్రేష్ఠి అనిగానీ, గుప్త అనిగానీ పేరు చివరిలో లేకుండా చాలామంది యున్నారు. తమ పెద్దలు ఆర్యులు చేసిన కుతంత్రపు పనికి విరుగుడుగా శ్రేష్ఠి, గుప్త అను పదములను పెట్టితే, వారి మాటను కాదని వైశ్యులు శ్రేష్ఠి అనిగానీ, గుప్త అనిగానీ పెట్టుకోకపోవడము పెద్ద పొరపాటు. దైవజ్ఞానము తెలియనివారు గుప్త అని పేరు చివరిలో పెట్టుకోకపోవడమే మంచిది. అయితే శ్రేష్ఠి అని పెట్టుకోవడము మంచిది. ఏ వైశ్యునికయినా కొంతకు కొంత ప్రపంచ జ్ఞానము ఉండుట వలన వైశ్యున్ని శ్రేష్ఠియని పిలువడము మంచిది.

వైశ్యులు క్షత్రియులకంటే ముందు వరుసలో యుండినవారై, ఆర్యులతోనే తాము శ్రేష్ఠులము అనిపించుకొనునట్లు శ్రేష్ఠి, గుప్త అని పిలిపించుకొనుటకు వారి పేర్ల చివరిలో అలా పెట్టుకొనినా, ఆర్యులు వాటిని పెద్దగా పెట్టుకోకుండా, ఆర్యవైశ్యులని వైశ్యులు చెప్పుకొనునట్లు చేశారు. ఆర్యుల పథకము ఒక వైపు పనిచేసి నేటికినీ ఆర్యవైశ్యులని చెప్పుకొను వైశ్యులున్నా, వారి పేరు చివరిలోనున్న గుర్తులు ఆర్యులు చేసిన మోసములకు ఎదురు తిరిగినట్లు గల సాక్ష్యములవలె కనిపించుచున్నవి. పూర్వము వైశ్యులు అనువారు ఒక ప్రక్క ప్రపంచ విషయములలో మేధావులుగా, మరొకప్రక్క పరమాత్మ విషయములో సంపూర్ణ జ్ఞానులుగా యున్నారనుటకు గుర్తుగా శ్రేష్ఠి, గుప్త అని చెప్పుకొనినా, నేడు కూడా పూర్వమువలె వైశ్యులు అన్ని రంగములలోనూ వారి ప్రతిభను కనపరచు చున్నారు. పంచాంగములను వ్రాయుటలోనూ, జ్యోతిష్యమును చెప్పడము లోనూ అందరికంటే ముందుండి మేము ఎవరికీ వెనుకలేము అని నిరూపించుకొంటున్నారు. రాజకీయ రంగములో గానీ, భక్తి భావ రంగములోగానీ, మిగత అన్ని రంగములలో వైశ్యులు అందరికంటే ముందు నేటికినీ ఉన్నారు.

నేను నా స్వంత అనుభవములో నేటి కాలములోనున్న కులములన్ని టినీ గమణించాను. ఒక్కొక్క కులము ఒక్కో విధముగా తమ హావ భావములను ప్రదర్శించుచున్నది. రెడ్ల కులమును చూచాను. కమ్మ కులమును చూచాను. నేను పుట్టింది కమ్మకులములోనే, కనుక నేను దానిని చూడకున్నా అదే నాకు బాగా కనిపించినది. దైవజ్ఞానము వాసన కూడా ఈ కులమునకు సరిపోదని తెలిసినది. అట్లని భక్తి భావములు లేవని నేను చెప్పడము లేదు. ఆత్మజ్ఞానము అంటే ఏమిటో వారికి తెలియదు, సరిపోదు అని చెప్పుచున్నాను. బ్రతుకుతెరువు చూపు తప్ప రెండవ చూపే ఉండదని అర్థమైనది. రెడ్ల విషయానికి వస్తే జ్ఞాన విషయములలో

కొంత మేలనిపించింది. డబ్బు సంపాదనవుండి, ఖర్చుపెట్టడము రెండూ సమానముగావున్నా, దౌర్జన్యమున్నా, కొంత పాపభీతి కలదు. దేవతా భక్తి యున్నా అంతటితో ఆగక ఆత్మజ్ఞానము కూడా కలదు. సమాజములో ఆర్థికముగా, రాజకీయముగా, భూస్వాములుగా, వ్యాపారులుగా మిగతా కొన్ని విషయములలో సమానముగా ముందుకు పోవువారుగా కమ్మ, రెడ్ల సామాజిక వర్గమువారే ఎక్కువగా యున్నారు. కావున దైవజ్ఞానము ఎడల, ఆత్మజ్ఞానము పట్ల ఈ రెండు కులములలో ఏమి తేడా యున్నదో నేను గమనించి చెప్పుచున్నాను. పూర్వము ద్రావిడులుగాయున్న వారే నేడు కమ్మ, రెడ్ల కులములుగా కూడా విభజింపబడ్డారు. దాదాపు సమాన సామాజిక హోదాకల ఈ రెండు కులములను చూడగల్గితే, దాదాపు నేటి ద్రావిడులు ఎలా ఉన్నారో తెలియగలదని చెప్పుచున్నాను.

రెండు కులములు ఒకే ద్రావిడ జాతినుండి వచ్చినవే. అందువలన ఈ రెండు కులములను గురించి కొంత మాట్లాడవలసి వచ్చినది. కమ్మ, రెడ్ల రెండు కులముల వారిలో కులము అను ప్రభావము కూడా కొంత కలదని కొన్ని నిరూపణలు నేను చూచి తెలియగలిగాను. ఒక కులము అంటే కొంత ప్రత్యేక భావముంటుందని, అలా ఆ కులము అలవాటు పడిపోయి వుంటుందని అర్థము చేసుకొన్నాము. కులములు మనము ఏర్పరచుకొన్నవే అయినా వాటిలోని హోదాలు, యోగ్యతలను కూడా మనమే ఏర్పరచుకొన్నాము అని చెప్పవచ్చును. కొందరు కులములో ఏముంది గుణములోనే ఉన్నది కదా! అంటూ వుంటారు. మేము కూడా అదే చెప్పుచూ ఒక్కొక్క కులము ఒక్కొక్క భావమునకు అలవాటు పడిపోయినది అని అంటున్నాము. ఆర్యులు, ద్రావిడులు అందరూ మనుషులే అయినా మేము గొప్ప అను భావము ఆర్యులలో ఇమిడిపోయినది. అలాగే ఎన్నో కులములలో ఎన్నో భావములు నిండుకొన్నవి. ఒక కులములో ఒక భావముండి ఆ కులమును ద్రావిడ భావమునుండి దూరము చేయుచున్నది.

అందువలన నావద్దకు వచ్చిన క్రొత్త వారిని నీ కులము ఏది అని మొదట అడుగుతాను. వారున్న కులమునుబట్టి వానిలో సహజముగా ఏ భావముండునో అంచనా వేసుకోగలుగుతాము. అప్పుడు అతనిని అతని సహజ భావమునుండి తొలగించి ద్రావిడ భావమునకు దగ్గరయ్యేటట్లు చేయుటకు ప్రయత్నిస్తాను. మాకు అన్ని కులములు సమానమే అయినా, వాటిలోని భావములు సమానము కావు అని తెలుసు. ఉదాహరణకు రెండు సమాన కులములుగాయున్న రెడ్డి కమ్మకులములలోని భావములు ఆత్మజ్ఞానము ఎడల ఎట్లున్నవో తెలుసుకొనుటకు ఒకే డాక్టరు వృత్తి చేయు ఒక రెడ్డి డాక్టరు దగ్గరికి, ఒక కమ్మ డాక్టరు దగ్గరికి నేను పోయి కలువడము జరిగినది. ఆ ఇద్దరు డాక్టర్లకు నేను కమ్మ కులస్థుడనని తెలుసు. ఒక ఆధ్యాత్మిక వేత్తనని తెలుసు గానీ, ఆధ్యాత్మికములో నేను ఎంత గొప్పయను విషయము మాత్రము వారికి తెలియదు. ఇరువురికీ తెలిసినంతలో జ్ఞానమును చెప్పుతాడు. పుస్తకములను వ్రాస్తాడు అని మాత్రము తెలుసు. ముందు హైదరాబాద్‌లో కమ్మకులస్థుడుగా యున్న పంటి డాక్టరువద్దకు పంటి సమస్యతో పోవడము జరిగినది. నేను అక్కడికి పోయిన వెంటనే ఆయన "లోకములో అందరూ సోమరిపోతులుగా తయారైపోతున్నారు ఇట్లైతే దేశము ఎట్లు బాగుపడుతుంది?" అని అసందర్భముగా మాట్లాడాడు. ఆయన ఎవరినో గురించి మాట్లాడినట్లు మాట్లాడినా, అతను మాట్లాడునది నన్ను గురించేయని నాకు అర్థమైనది. దేవుడు దయ్యము అనుకొంటూ మాటలు చెప్పుచూ ప్రజల మీద పడి డబ్బులు సంపాదించుకొనుచూ, పనీపాటా లేని వారు తయారయినారని నన్ను పరోక్షముగా అనినట్లు నాకు అర్థమయి పోయినది. తర్వాత ఆయన వందరూపాయల చికిత్సకు లేనివి, కానివి చెప్పి రెండువేలు లాగాడు. నేను ఒకప్పుడు డాక్టరునే కనుక అక్కడ ఎంత చికిత్స అవసరము అనునది నాకు బాగా తెలుసు. ఆ డాక్టరుకు డబ్బులు సంపాదించడమే ధ్యేయముగా ఉండుటవలన, ఆయన

అక్రమముగా డబ్బులు లాగాడని తెలుసు. డబ్బులు లాగినా ఫరవాలేదు, అది అతని స్వభావము అనుకొందాము. అదీకాక జ్ఞానులనందరినీ సోమరిపోతులను చేసి మాట్లాడడము మరీ వింతగా యున్నది. మొదటి నుండి ఎందరినో కమ్మ వారిని చూచి వారివద్ద జ్ఞానమునకుగానీ, జ్ఞానులకుగానీ ఏ విలువా ఉండదని గ్రహించాము. అందులో చివరి డాక్టరు విషయమును మీకు చెప్పాను అనుకోండి.

తర్వాత కొంతకాలమునకు అనంతపురంలో రెడ్డి కులస్థుడైన ఒక డాక్టరు వద్దకు పోయాను. ఆయనకు కూడా నేను కమ్మకులస్థుడనని తెలుసు, ఆధ్యాత్మికవేత్తననీ తెలుసు. నేను డాక్టరుగారివద్దకు పోయిన వెంటనే ఆయన లేచి నిలబడి గౌరవముగా మాట్లాడడము జరిగినది. కొన్ని ఆరోగ్య పరీక్షల వద్దకు తానే వచ్చి స్వయముగా పరీక్షించి చూచి, వాటి ఫలితములను వెంటనే వ్రాసి ఇవ్వడము జరిగినది. అనంతపురము లోని డాక్టరుగారు ఒక్క రూపాయి కూడా తీసుకోకుండా ఉచితముగా చూచారు. నాలోని ఆధ్యాత్మికమునకు గౌరవించి మాట్లాడారు. అదే హైదరాబాద్‌లో డాక్టరు కనీస గౌరవమును ఇవ్వకపోగా జ్ఞానులను సోమరిపోతులని మాట్లాడడము జరిగినది. డబ్బు విపరీతముగా లాగడము జరిగినది. ఇద్దరూ డాక్టర్లే, ఇద్దరి దగ్గరకు పోయినది నేను ఒక్కడినే. అయితే ఒకరు రెడ్డి, ఒకరు కమ్మ అయినందున కమ్మ కులస్థుడు తన కుల సహజత్వమును కనబరచాడు. అలాగే రెడ్డి కులస్థుడు కూడా తన స్వభావమును కనబరచాడు. ఒక్క కులము తేడాతో భావములు ఎంత తేడాయున్నవో బాగా అర్థమైపోవుచున్నది. ఈ విధముగా నాకున్న 64 సంవత్సరముల వయస్సులో ఎంతోమందిని చూచి గ్రహించి చివరకు వచ్చిన నిర్ణయమును తెలుపుచున్నాను. కులములలో భావములు ఉంటాయని నాకు బాగా అర్థమైనది.

ఈ విధముగా నాకు దగ్గరగా యున్న ఎన్నో కులములనూ వాటి భావములనూ చూచాను. అటువంటి అనుభవముతో కులముల ప్రసక్తే లేకుండాపోతే సమాజము ఎంతో బాగుపడుతుందని అనుకొన్నాను. అటువంటి కులనిర్మూలన కార్యమును మేము ఎప్పుడో ప్రారంభిచాము. ఆత్మజ్ఞానమునకు విలువ ఇవ్వని కులములకు దూరముగాయుంటూ వారిని జ్ఞానులుగామార్చి దగ్గర చేసుకొంటున్నాము. అందరినీ ఒకే దైవ భావము లోనికి తెచ్చి, అసలైన ద్రావిడ రాజ్యమును స్థాపించాలని అనుకొన్నాము. అది ఒక పెద్ద కార్యము, మనదా చిన్న జీవితము. ఇప్పటికే 64 సంవత్సరముల కాలము గడచిపోయినది. గడువవలసినది చాలా తక్కువ కాలమున్నది. ఇంత చిన్న కాలములో అంత పెద్ద కార్యము నెరవేరునా? అని ప్రశ్నవచ్చినా దానికి సమాధానము "ప్రారంభించవలసినది మనము ముగించునది వేరొకరు" అను సూత్రము ప్రకారము ప్రారంభించవలసిన బాధ్యత నాకున్నది. కావున మంచి కార్యము కొరకు ప్రయత్నమును ప్రారంభించాము అంతే. **"కంటికి కనిపించు వాడు ప్రారంభిస్తే కనిపించని వాడు ముగిస్తాడు"** అని నేను చెప్పుచున్నాను.

ఒక్క ఆర్యులు ద్రావిడులను చీల్చివేయడముతో లోకములో ఎన్నో కులములు వచ్చినవి. కులములను కలిపితే తిరిగి ద్రావిడులు వస్తారు. ద్రావిడులు వస్తే, మూడు ఆత్మల ద్రావిడ జ్ఞానము వస్తుంది. ముగ్గురు పురుషుల జ్ఞానము వస్తే తిరిగి కృతయుగములోని ఇందువులు వస్తారు. భారతదేశము పూర్తి ఇందూదేశముగా మారిపోతుంది. ప్రతి వ్యక్తిలోనూ జ్ఞానశక్తి ఉంటుంది. ఈనాడు ఏ శక్తీలేని సాధారణ జీవితము గడుపుటకంటే దైవశక్తితో నిండిన జీవితము గడపడము ముఖ్యము. అందువలన ప్రతి మనిషీ ప్రస్తుతమున్న తన కుల, మతములను ప్రక్కన పెట్టి, నేను మనిషిని అని తలచి, మనిషికుండవలసిన ప్రాథమిక లక్షణములేవో మొదట తెలుసు

కొనుటకు ప్రయత్నించవలెను. ప్రాథమికముగా మనిషికీ మనిషికీ ఏ తేడా లేదు. ఒక మనిషిలోనున్న మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అన్నీ సమానముగా యుండడమే కాక అందులోని జీవుడు కూడా అందరిలో సమానముగానే యున్నాడు. శరీరము లోపల ఒక మనిషికి ఏమున్నవో అవియే మరొక మనిషికి కూడా కలవు. మనిషికీ మనిషికీ ఏ తేడా లేదని ప్రాథమిక జ్ఞానము వలన తెలిసిపోవుచున్నది. మనిషికీ మనిషికీ లోపల ఏ తేడా లేనప్పుడు బయట మాత్రము ఎందుకు ఇంత తేడాయని ఆలోచిస్తే, మనిషి తనవెంట తెచ్చుకొన్న కర్మమూటల తేడా తప్ప మరొకటి లేదని తెలియుచున్నది. కర్మయను మూట బరువులు వేరు వేరుగా యుండుట వలన అందరూ సక్రమముగా నడువలేక బరువు ఎక్కువయినవాడు నడుచు నడక వేరన్నట్లు మనిషి జీవితములు కూడా వేరయినవి. బరువు తక్కువ వాడు సులభముగా, వేగముగా నడువగల్గితే, బరువు ఎక్కువ ఉన్నవాడు కష్టముగా నిదానముగా నడుచునట్లు సమాజములో వారివారి కర్మలనుబట్టి వారి వారి నడవడికలు ఏర్పడినవి. అవియే కులములుగా, మతములుగా ఉండి నడిపించుచున్నవి. అందువలన కర్మలు పోతే మనుషులలో కుల మత తేడాలు లేకుండా పోవును కర్మలు పోవాలంటే తిరిగి ద్రావిడ జ్ఞానమనబడు త్రైత సిద్ధాంత జ్ఞానమును తెలియాలి. ఎప్పుడు మూడు ఆత్మల ద్రావిడ జ్ఞానమును తెలియగల్గుదురో, అప్పుడు ప్రతి ఒక్కరూ కర్మ బంధమునుండి బయటపడగలరు. కర్మబంధమునుండి ఎప్పుడు బయట పడుదురో అప్పుడు దేవుడు తెలియబడును. అప్పుడే దేవునిలోనికి ఐక్యమై పోగలరు. అందువలన నా మాట విని నీ కులమును, నీ మతమును ప్రక్కన పెట్టి ప్రాథమిక జ్ఞానమును అనుసరించి నీవు ఎవరో నీవే చూచుకో! లేక తెలుసుకో!! ఇంతకంటే ఎక్కువ చెప్పుటకు ఏమీ లేదు.



# ద్రావిడ బ్రాహ్మణ




మానవాకారములో ఉన్న భారతదేశము

**www.thraithashakam.org**